## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మన శాస్త్రజ్ఞులు

(ఆదర్శ జీవితములు)

[ Telugu Nondetailed for Higher Forms ]


రచయిత

విద్వాన్, శ్రీ దివాకర్ల రామమూర్తి, యం. ఏ.

మిస్సర్సు ఎ. వి. యన్. కళాశాల,

విశాఖపట్టణము



పబ్లిషర్

వల్లమూడి రామయ్య

ఎడ్యుకేషనల్ పబ్లిషర్

నెల్లూరు


 1950 [క్రయము 1-0-0

# ఆదర్శ జీవితములు

# మన శాస్త్రజ్ఞులు

## 1

### భిషగ్వర మహేంద్రలాల్ సర్కారు

ఆధ్యాత్మిక జ్ఞానమున కాలవాలమయిన యార్యావర్తమున నెన్ని నాగరికతలు వర్ధిల్లి నశించినను, ఎన్ని రాజ్యములు పొడసూపి పేరుమాసినను చాలకాలమువఱకు నైహిక జ్ఞానవిషయకమయిన యభిరుచి యంతగాఁ గలిగియుండలేదు. కాలక్రమమున ననుమానజ్ఞానప్రమాణముల నాదరించు దినములు పోయినవి. ప్రత్యక్ష ప్రమాణమునం దాసక్తి జనించినది. తత్త్వజిజ్ఞాస వృద్ధియై, సత్యాన్వేషణమునకు మనీషులాత్మార్పణము చేయుకాలము నడుగుదెంచెను. ఖండాంతర దేశీయులు పదార్థ రసాయనాది శాస్త్రములయందుఁ బరిశోధనలు గావించి, వాని ఫలితములను మానవ కళ్యాణమునకు సమర్పించుచుండ, మడికట్టుకొని మంత్ర విశ్వాస మూఁదకొని యుండుట వెఱ్ఱి యనిపించినది. మానవుని విజ్ఞానమనంత మయినది. ఒక్క బుద్ధిగాని, యొక్క జాతిగాని, యొక్క యుగముగాని తరింపరానిది. అనంత శాస్త్ర ప్రపంచమున నొక యంశమాత్ర లాభముచేఁ దనివి నొందుట యలసత్వ మనిపించుకొనును. ప్రపంచవిజ్ఞానమును గ్రహించి ప్రసరింపఁ జేయుటకుఁ గొందఱు నిమిత్తజన్ము లన్నియుగములందును, నన్ని దేశములయందును బుట్టుచుందురు. వారు

శాంతిదూతలు కావచ్చును; యుద్ధప్రబోధకులు గావచ్చును; విజ్ఞాన ప్రచారకులు గావచ్చును. కాలము తన యావశ్యకముల నెఱుంగుటలో నారితేరినది. శాస్త్రవిజ్ఞాన శూన్యముగ నున్న కాలములో హిందూదేశమున శాస్త్రీయ జ్ఞానప్రచారమును జేయుట కవతరించిన కారణజన్ములలో మహేంద్రలాల్ సర్కారొకఁడు.

మహేంద్రలాల్ సర్కారు హౌరా పరిసరములందున్న 'పాయక్పర' యను నొక కుగ్రామమున క్రీ.శ. 1833వ సంవత్సరము నవంబరు మాసమున రెండవ తేదీని జనన మొందెను. 'పాయక్పర' మీ మహనీయుని సంభవముచే మాత్రము ప్రసిద్ధికెక్కినది. అది కాక యట్టిగ్రామ మొందున్నదని ప్రభుత్వపు వ్రాతలలోఁగూడ నగుపడదు. ఈతని తల్లిదండ్రులను గూర్చి యేమియును దెలియదు. సర్కారు కర్షకసంప్రదాయమున జీవించు వంశమునందు జన్మించిన వాఁడు. అతఁడు విద్యావంతుఁడై, రెండుచేతుల ధనము నార్జించి, గొప్పగొప్ప సంస్థలను స్థాపించినప్పుడు గాని, గౌరవ విద్యార్థి వేతనములను, బహుమానములను నొసంగినప్పుడుగాని, వానిని వేనిని దన తల్లిదండ్రుల పేర నంకితములఁ గావించి యుండలేదు. బహుశః ఈతని చిరుతప్రాయముననే పితరులు మరణించి యుండవచ్చును. ఈతని తండ్రి తల్లికంటె నొండురెండు వత్సరములు పెద్దవాఁడై యుండును. ఈతనితల్లి యిరువదినాలుగవ యేట నీతనిని గనెను. ఆ దినములలో హిందూసంఘమున బాల్య వివాహము లాచారముగ నుండెను. కొన్ని సూచనలను బట్టి యీతని మొదవ

యేటనే ఇతని తండ్రి పరమపదించె ననియు, మఱి నాలు గేండ్లకే యీతనికి మాతృవియోగము కలిగెననియుఁ దెలియుచున్నది. తండ్రిపోయిన తరువాత నుత్తరక్రియలను జరిపించి యీతని తల్లి సర్కారుతోఁ గలకత్తానగరము నకు వచ్చి తన సోదరునియింట నివసించెడిది. సర్కారు జీవితాంతమువఱ కా ప్రదేశమును మిక్కిలి ప్రేమించెడి వాఁడు. జననియు, జన్మభూమియును స్వర్గముకంటెఁ బ్రీతి దాయకము లనుటలో నతిశయోక్తి లేదు కదా!

విద్యాభ్యాసము :

హైందవాచారము ననుసరించి మహేంద్రుఁడు మాతృ భాషయగు వంగభాష నభ్యసించుటకు గురుమహాశయుని కడకు వీథిబడికిఁ బంపఁబడెను. శ్రద్ధాభక్తులుమీఱ నాతఁ డెల్ల విషయములను సూక్ష్మబుద్ధితో గ్రహించి చూపఱ నాశ్చర్య నిమగ్నులను గావించుచుండెను. "క్షణశః కణశ శ్చైవ విద్యా మర్థంచ సాధయే" త్తను నుడి మహేంద్రునియం దాతని కెఱుకపడకయే సార్థకమయినది. క్షణ మూరక పోయినఁ జాలదినములు వ్యర్థములయ్యెనని యాతఁడు విచారిం చును. ఇంతటి విద్యా దీక్ష, కుశాగ్రబుద్ధి పరిశీలించుచుండిన యీతని సహకారుల కితనిపై నత్యంతాదరము కలిగెను. వా రెల్లరయిన నీతఁ డాంగ్లవిద్యాభ్యాసము నొందవలయునని యెంచి తగిన సాహాయ్య మొసర్చిరి. మహేంద్రున కాంగ్ల భాషలో నక్షరశిక్షనొసర్చినయతఁడు బాబూ తారక నాథ డే మహాశయుఁడు. ఇతఁడు దైవికముగాఁ దటస్థపడెను.

మేధా పరిణామకాలమున మహేంద్రునకీ తారకనాథుని తోడి విద్యాభ్యాస మమూల్యముగా నుండెను. తారక నాథుడే మహాశయుఁడు సాధారణోపాధ్యాయుఁడు కాఁడు. తన వ్యక్తిత్వమును, విజ్ఞాన సంపదను బాలుఁడగు మహేంద్రుని హృదయ ఫలకమున శాశ్వతముగ ప్రతిఫలింపఁ జేసిన దేశికుఁ డీతఁడు. తన యాంగ్లభాషాధ్యాపకునిఁ గూర్చి పెక్కు మార్లు మహేంద్రసర్కారు కృతజ్ఞతాపూర్వకముగఁ బ్రసంగించియుండెను. ఆ దినములలోఁ దారకనాథుడే విద్యార్థులకు విద్యారణ్యశిష్యుల కున్నంతటి గౌరవముండెను. తారకనాథుఁడు నాలుగు మాఁ డింగ్లీషు పదముల నేర్చుకొని, గబగబ ఇంగ్లీషు మాటలాడుట నలవరచుకొన్న పెక్కురు వంగపండితులవంటివాఁడు గాఁడు. నిజమున కాతఁడా వేశపరుఁడు; ఉదారాశయుఁడు; గంభీరహృదయుఁడు; విద్యాపరతంత్రుఁడు. సర్కారనిన నాతని కెక్కుడు లేని యానందము. తన దేశికత్వ మాతని మూలమున ఫలవంతము కాఁగలదని యాతని నమ్మిక. తన దీర్ఘజీవితానుభవమున నార్జించిన గుణరత్నములను దన యంతేవాసిహృదయక్షేత్రమున నాటి, తత్ప్రకాశములఁ జూచి యానందింపవలయునని యా యపూర్వ వాత్సల్య సముద్రుని యభిలాష. ఆరోగ్యము క్రమక్రమముగా క్షీణింప మొదలుపెట్టిన తన యిరువది తొమ్మిదవయేట మహేంద్రలాలు సర్కారు బాల్య గురువయిన తారకనాథ పండితునిఁ గూర్చి "కీర్తిశేషుఁడు, నాకు బాల్యగురువు నయిన తారకనాథుడే కడనుండి నేను విద్యాబీజములను గ్రహించితిని. ఆ మహనీయునకు నా యెడఁ

బుత్త్రునికంటె నెక్కుడుప్రేమ " యని సంస్మరించెను. ఇంత కంటె గురువులు శిష్యుల కడనుండి పొంద నూహించు గౌరవోపహార మెద్ది? తారకనాథుని విద్యాకృషి పవిత్రమయినది, ఫలవంతమైనది.

మహేంద్రలాల్ సర్కారు తారకనాథోపాధ్యాయుని కడఁ బండ్రెండు మాసములు విద్య గఱచెను. అప్పటికే యతని మాతులుని సంసారము చితికిపోవుట కారంభించెను. ఈతని పెద్ద మేనమామ కలకత్తావదలి సంతతము గ్రామాంతరవాసము చేయవలసిన ప్రభుత్వోద్యోగమున నియుక్తుఁడై యిలువెడలిపోయెను. ఆ దినములలో 'డేవిడ్ హేరు' అను లోకహితైషి యొక యాంగ్లవిద్యాలయమును స్థాపించి యుచితముగా విద్యార్థులను స్వీకరించుచు విద్యగఱపుచుండెను. ఎట్లో శ్రమపడి తన చిన్నమేనమామ ప్రయత్నములకు ఫలితముగా 'హేరువిద్యాలయమున' మహేంద్రలాలు ప్రవేశము గడించెను. కృతజ్ఞతాకరమయిన సర్కార్ హృదయమున 'డేవిడ్ హేరు' మహాశయుని జనానురాగము స్థిరమయి చిరస్మరణీయ మయినది. ఆ 'హేరు' పండితుని గూర్చి మహేంద్రలాల్ "ఇతఁడు వంగదేశమునకు విద్యాజనకుఁ"డని చెప్పుచుండెడివాఁడు. తాను శాస్త్రపరిషత్తు నొకదానిని స్థాపించిన వెనుక 'హేరు' నామమును శాశ్వతీకరించుట కతనిపేర నొక 'విద్యార్థివేతనమును దానొసంగి యాతనియందలి గౌరవమును జూపెను. ఈ 'డేవిడ్ హేరు' 1842 వ సంవత్సరమున మృతిజెందెను. ఆతని మరణము సర్కారు విద్యార్థి దశలోఁ గొంత భంగమును గలిగించెను.

తరువాత నా విద్యాశాలకు ప్రధానోపాధ్యాయుఁడుగా వచ్చిన "ఉమాచరణ మిట్టర్" దయచే నీతఁడు మఱలఁ బాఠశాలలోఁ బ్రవేశించి నిరాటంకముగ విద్య గఱచి 1849-వ సంవత్సరమున విద్యాశాలతరగతులనుండి యుత్తీర్ణుఁడై విద్యార్థివేతనమునొందు గడించి యున్నత విద్యకొఱకు హిందూకళాశాలలోఁ బ్రవేశించెను.

హిందూకళాశాలాధ్యక్షుఁడు సట్లిఫ్. ఇతఁడు గణితశాస్త్రాచార్యుఁడు కూడ. ఇతఁడు ప్రకృతిచే దయామయుఁడు. ఉత్తమవిద్యార్థుల కీతఁడు తండ్రియనిన నతిశయోక్తి కానేరదు. విద్యార్థులయంతశ్శక్తుల నీతఁడు కనుగొనినంత గా నితరోపాధ్యాయులు కనుఁగొనఁజాలరు. ఆతని విస్తృత విజ్ఞానము, సూక్ష్మతరావగాహన శక్తి, ప్రియమునైన పద్ధతు లాతనిని జనానురంజకునిగాఁ జేయుటయే కాక కళాశాలాధ్యక్షునిగఁ గూడఁ జేసినవి. అట్టి యుత్తమున కచిరకాలములో మహేంద్రలాల్ సర్కా రభిమానవిద్యార్థి యగుటలో నాశ్చర్యము లేదు. సర్కారాంగ్ల భాషయందలి పరిచయముచేతను, ప్రాచ్యపాశ్చాత్య వేదాంత తారతమ్య పరిజ్ఞానముచేతను 'జోన్సు' పండితుని యాదరాభిమానములకుఁ బాత్రుఁడయ్యెను. ఇది సర్కారు జీవితమున వసంతకాలము. ఈకాలమున నత్యధికోత్సాహమునను, స్వాతంత్ర్యమునను నాంగ్లభాషయందలి యుత్తమమునైన రచనలను, శాశ్వతానందకరములగు పాశ్చాత్య వేదాంతములను ఈతఁ డత్యాసక్తితోఁ జూచులాడెను. సర్కా రత్యధిక పఠనశీలుఁడు. ఈ పఠన మాతఁడు జీవితాంతము మానినదిలేదు. హిందూకళాశాలయందలి

యూతని జీవితచర్యను బరిశీలించిన భవిష్యత్కాలమునను దార క్రియాచణుఁ డితఁడు కాగలఁడనుటకు నిదర్శనము లనేకము గోచరించును. విద్యార్థిగానుండు కాలముననే కాక, తన వైద్యవృత్తిలోను, ప్రజాసంస్థలయందును నిమగ్నుఁడై యుండు నవసరములందుఁగూడ నీతఁడు ప్రతిదినము కొంతకాలము చరిత్ర, వాఙ్మయము, వేదాంతము మున్నగు మానవత్వ ప్రవృద్ధికరములగు విషయములఁ జదువుటకు వినియోగించు వాఁడు. వాఙ్మయాది విషయములతో నత్యంత పరిచయము కలిగియుండునాఁడే శాస్త్రజ్ఞానము సర్వసమగ్రము కాఁగల దని సర్కారు నమ్మకము. అందుచే నిత్యప్రవర్ధమానము లును, పరిశోధితములు నగు శాస్త్రసారస్వతాది విషయము లతో సన్నిహిత పరిచయ మాతఁడు సంపాదించుకొను చుండు వాఁడు. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా మున్నగు దేశ ములనుండి వచ్చు తపాలులో నీతనికి నసంఖ్యాకములగు పుస్తకములు వచ్చుచుండెడివి. భిషగ్వరుని మరణానంతరము కూడ నాతని చిరునామాకు యూరపు దేశములనుండి పుస్త కముల బంగీలు వచ్చినవనుటలో నాశ్చర్యము లేశముకూడ లేదు. భిషగ్వరుని మరణానంతర మాతని వార్షిక స్మారక సభలో ప్రసంగించుచు రావుబహద్దరు డాక్టరు చునిలాల్ బోసు "డాక్టరు మహేంద్రలాల్ సర్కారు గొప్ప విద్వాం సుఁడు. అతఁడు వైద్య గ్రంథములయందే కాక వివిధశాస్త్ర శాఖలయందును, సామాన్య సారస్వతాదులయందును నపరిమితముగా బ్రవేశము కలిగినవాఁడు. అతని సమకాలి కులలో నెవ్వరికో కాని యంత వివిధశాస్త్రపరిజ్ఞానము,

అంతటి గ్రంథాలయము లే''దని శ్లాఘించెను. ఇంతకును సర్కారు జీవితమంతయు నొక విద్యాతపస్సు.

సర్కారు తన జీవితోత్తరభాగములో హక్స్లీ, మిల్లు మున్నగువారి శాస్త్రగ్రంథములన్నె నెక్కుడాసక్తి చూపెడివాఁడు. వారి గ్రంథములఁ జదువుచు దివారాత్రము లాతఁడు పరిగణింప కుండెను. తద్గ్రంథ పఠనమే యీతని జీవితమున నుత్తమమార్గ పరావర్తనక్రియయైనది. మిల్టను మహాశయుని 'నష్టస్వర్గము' (Paradise Los ) మున్నగు గ్రంథములనుండి సర్కారు తరచు గాఁ దన ప్రసంగములలో నుదాహరించెడి వాఁడు. అయిన నా గ్రంథ మాతని జీవిత దృష్టిలసన మున నెట్టి మార్పును గల్పించినట్లు సూచన యగుపడదు. వయస్సంత ముదిరినను శాస్త్రతృష్ణ తీరిన దేకాదు. తాత్కాలికముగఁ జదువునప్పుడు సారస్వతగ్రంథములు, వేదాంత చర్చలు సర్కారు హృదయము నాకర్షించినవే కాని, శాశ్వతమైన యానందమును, హృదయతృప్తిని గలిగించినవి కావు. అందుచేఁ గళాశాలలయందు గఱపఁబడు విద్యల నిష్ప్రయోజకత్వ మాతనికిఁ బొడచూపెను. హక్స్లీ, మిల్లుల నిబిడ శాస్త్ర చర్చాత్మకములగు గ్రంథము లాతనికి సులభగ్రాహ్యము లగుచుండెడివి కావు. తచ్ఛాస్త్రజ్ఞుల తత్త్వములను, రచనలను, బరిశోధనలను నవగాహనము చేసికొనుటకు ప్రయోగవిజ్ఞానమును బొందియుండ వలయునని యాతఁ డూహించెను. అందుచే భగవత్ప్రేరితమయిన నవోత్సాహముతో నాతఁడు శాస్త్రవిద్యాభ్యాస మను నమృతపానమునకు హృదయమున తహతహలాడఁ జొచ్చెను.

శాస్త్రసంక్తి క్రమముగా సర్కారు హృదయ క్షేత్రమున వేరూనిన కాలమునకు హిందూకళాశాల రాజధాని కళాశాలగా మారెను. సర్కారున కగ్రవిద్యార్థి వేతనము బహూకరింపఁబడెను. అట్టి యుపహారము చే నీతని గాఢశాస్త్ర జిజ్ఞాస యరికట్టఁబడలేదు. తన హృదయావేదనమును దీర్పఁగల సంస్థకొఱ కాతఁడు వర్షోదకముల కొఱకు చాతకముల వలె నుత్కంఠతో నన్వేషింప సాగెను. ప్రముఖశాస్త్రీ ధ్యానములలో సప్రయోగ పాఠములను బోధించునట్టి దాదినములలో కలకత్తా వైద్యపాఠశాల యొక్కటియే. 'లేని బావకంటె గ్రుడ్డిబావ మే' లను సామెతగా నా పాఠశాలలోఁ జేరుట యాతనికి మేలనిపించెను. నిరాధారుఁడయి నట్టేట మునుంగునట్టివాఁడు కనఁబడిన తృణముతోనైన సంతోషించి దానిని పట్టుకొని యీఁదులాడవలయునని కోరునట్లు సర్కారట్టి పాఠశాల యైన శాస్త్రప్రయోగముల బోధపఱుచునట్టి దైనచో మేలుగీళ్లు పరిగణింపక యందుఁ బ్రవేశింప వలెనని యాలోచించుచుండెను. రాజధాని కళాశాలా విద్యావిధానము 'ఆంగ్లభాషను జదువుట వ్రాయుట నేర్పుటయే ప్రధానోద్దేశముగాఁ గలిగినదిగా' నాతనికి గోచరించెను. హృదయమున నొక పెనుయుద్ధము జరుగుచుండెను. సంక్షోభ మధికమయ్యెను. పదునైదేండ్లభ్యాసమైన వెనుకఁ గూడ నిర్దోషముగ నింగ్లీషు మాట్లాడుట, వ్రాయుట యలవఱుపని విద్యాభ్యాసమును జూచి స్వదేశీయుఁ డెవ్వఁడును గర్వింప వలసిన యవసరము లేదని యాతఁడు తలపోసెను.

సర్కారునకు పూజ్యార్హుఁ డనిపించినట్టి వాఁడు, నతని యం దత్యంతవాత్సల్యము కలవాఁడు నయిన సట్లిఫ్ పండితుఁడు సర్కారు మాఢ్యమునకు విస్మితుఁడయ్యెను. తనంతఁగా సర్కారును బిలిచి మందలించి, యాతని బుద్ధి మరలింపఁ జూచి విఫలుఁడై దయాశీలుఁడయిన సట్లిఫ్ నిరాశాహృదయుఁడగుటయే కాక సర్కారు మొండితనమునకుఁ గోపముగూడఁ జెందెను. కాని జోన్సుపండితుఁడు సట్లిఫ్‌ను శాంతపఱిచి వైద్యకళాశాలయందుఁ బ్రవేశించుటకు సర్కారు ననుమతింపఁ జేసెను. సర్కారు 1855-వ సంవత్సరమున వైద్యకళాశాలలో విద్యార్థిగాఁ జేరెను.

వైద్యకళాశాలలోని ప్రయోగశాలలు మహేంద్రలాల్ సర్కారు హృదయదాహమును శాంతింపఁ జేసెను. శ్రద్ధాబుద్ధితోఁ బ్రయోగము లాచరించుచు నాతఁడు తన్నుఁ దా మఱచుచుండెను. అంతవఱకు సంతర్నిహితమై యున్న యాతని బుద్ధికుశలత్వము పూవులు పూవ నారంభించెను. ఆ ప్రయోగశాలలలో నాతఁడు తుట్టతుదకుఁ దనకు సముచితమైన స్థానము లభించినదని సంతోషించెను. పరమాత్మఁ గూర్చిన రహస్య మవగత మయినయట్లు సర్కారుప్పొంగెను. ఎన్ని జన్మాంతరముల నుండి యాతని యాత్మ ప్రయోగాత్మకమయిన శాస్త్రవిజ్ఞానము కొఱకటమటించి తుదకీరూపమును దాల్చెనో!

సర్కారచిరకాలముననే కళాశాలాచార్యులయొక్క యభిమాన విద్యార్థియగుటయును, నుత్తమవిద్యార్థిపేరిమిని సంపాదించి బహూకృతుఁడగుటయును నాశ్చర్యము లేదు.

వృక్షశాస్త్రమునందు, శారీరశాస్త్రమునందు, నౌషధ తత్త్వమునందు, శస్త్రచికిత్సయందు, ధాత్రీపరీక్షయందును నాతఁ డగ్రగణ్యుఁడయ్యెను. వైద్యకళాశాలలో నాతనిజీవితము మహోజ్జ్వలస్థానము నొందినది. వైద్యకళాశాలలో నతఁ డభ్యసించుచుండ రెండవవత్సరమున సంభవించిన యొక సంఘటన మాతని భావి జీవిత మహత్త్వమును వ్యక్తము చేసియుండెను. ఒకదినమున సర్కారు తనబంధువుల కుఱ్ఱవాని నొకనిని, కళాశాలా సంబంధి వైద్యశాల కక్షిరోగచికిత్సకొఱకుఁ దీసికొని పోయెను. ఇప్పటి వలెనే యాదినములలోఁ గూడఁ బంచమ వర్ష విద్యార్థులను భిషగాచార్యులు తమతమ ప్రయోగశాలల యందు, తల్పములకడ రోగులను బరీక్షించుచు శాస్త్రవిషయ ములఁ గూర్చి ప్రశ్నించుచుండిరి. డాక్టరు అర్చర్ అనునతఁ డక్షిరోగవైద్యుఁడు. అతఁడు దృక్ప్రసరణమును గూర్చియు, నేత్ర ధాతికనిర్మాణాదికమును గూర్చియు బాలురను గఠినమైన ప్రశ్నలడుగుచుండెను. నేత్రవ్యవచ్ఛేదవిద్యను గూర్చి యావైద్యపండితుఁ డొక వైద్యవిద్యార్థిని ప్రశ్నించెను. ఆ విద్యార్థి యుత్తరమెఱుంగక యాలోచనా నిమగ్నుఁ డయ్యెను. గవాక్షముకడనుండి మందు సీసాను గ్రహించు చుండిన సర్కారా ప్రశ్న నాలకించి దూరమున నుండియే సమాధానము నొసంగెను. 'ఎవ్వడాతఁ' డని డాక్టరు అర్చరాశ్చర్యముతో నలుప్రక్కలను దిలకించెను. సర్కా రాతనికడకువచ్చి వినయమున నిలుచుండెను. అర్చరున కాతనిఁ జూడఁగనే కలిగిన సంతోషపారవశ్యము వర్ణ

నాతీతము. తనప్రశ్నలకు వర్షపంచకము జాగరూకతతో శాస్త్రవిద్యాభ్యాసము చేసి ముగించినవారలే సమాధానము చెప్పలేకుండ నీతఁ డెట్లు చెప్పఁగలిగెనని యాతఁ డాశ్చర్య నిమగ్నుఁడై, క్లిష్టతరములయిన మఱికొన్నిప్రశ్నలు వేసి, సరియైన సమాధానములను బడసి, యాతని శాస్త్రావగాహమునకు మెచ్చుకొని, తనవిద్యార్థులలో నాతనిఁ బ్రియతమునిఁగా జేసికొని యపారవాత్సల్యమున నాదరించెను.

విశేషజ్ఞాన మార్జించుటకు నేత్రచికిత్సాలయమున కాతనిని తరచు రమ్మని యాతఁడు ప్రోత్సహించెను. సర్కారు తన్ను అగ్రతరగతి విద్యార్థులు కోర, కళాశాలాధ్యక్షునియొక్కయు, నేత్రశాస్త్రాచార్యునియొక్కయు నంగీకారము నొంది, నేత్రనిర్మాణ మెట్లు దృగ్యంత్రమును బోలియున్నదో సులభముగ నవగాహమగునటు లుపన్యసించెను. ఆదినములలోనే యొక సంఘము వారియెదుట మారవస్తు సందర్శనమున నేత్ర మెట్లు ప్రవర్తించునో యాత డుపన్యసించెను. ఈ యనన్యమేధాసంపద పూర్వజన్మ సంస్కార ఫలితము కాదని యెవ్వరనఁగలరు?

సర్కారాఱుసంవత్సరములు వైద్యకళాశాలయందుండి కృతార్థుఁడై 1860-వ సంవత్సరమున 'ఎల్. ఎం. యస్.' బిరుదము నొందెను. వైద్యధర్మశాస్త్రమున సర్కారు బంగారు పతకమును బహుమతిగాఁబడసెను. ఈబంగారుపతక మాతని ప్రత్యేకశాస్త్రజ్ఞానమునకై యీయఁబడినది. పరీక్షాపత్రములోని యొక ప్రశ్నమునకు శాస్త్రగ్రంథముల యందుఁ జెప్పఁబడినదానికంటె పెద్దమోతాదు కావలయు నని యాతఁడు

వ్రాసెను. పరీక్షకుఁ డావిషయము తనకే క్రొత్తదగుట నయ్యది సదుత్తరముగాఁ బరిగణింపలేదు. దీనికిఁ గారణ మాతఁడత్యాధునికములయిన శాస్త్రపత్రికలను బఠింప కుండుటయే. సర్కారు విద్యార్థిదినములయందును వైద్యశాస్త్రమునకు సంబంధించిన పత్రికలను జాగరూకతతోఁ బఠించుచుండెడి వాఁడు. ఆతని యా విద్యాదీక్షయే యమూల్యమయిన బంగారుపతకమున కాతనిఁ బాత్రునిఁగా జేసినది.

వైద్యకళాశాలలోఁజేరినసంవత్సరమే సర్కారునకు వివాహమయ్యెను. యల్.యమ్.యస్. పరీక్షలోఁగృతార్థుఁడయిన సంవత్సరముననే యాతని కొక కుమారుఁ డుదయించెను. ఆతఁడే డాక్టరు అమృతలాలుసర్కారు. 1863వ సంవత్సరమున సర్కారు యం.డి.పరీక్షకుఁ గూర్చుండి ప్రథమ శ్రేణిలోఁ గృతార్థుఁడయ్యెను. ఆజన్మవిద్యార్థియైన విద్యాతపస్వి కృతార్థుఁడగుటలో వింతయేమి ?

## II

## విశాలజీవితరంగము

డాక్టరు చక్రవర్తి యొక్క నిరంతర కృషిచే నప్పుడే 'వైద్యసంఘ' మొండు కలకత్తాయందు స్థాపింపఁబడెను. వైద్యప్రపంచమున ననన్యదుర్లభమైన యం.డి.బిరుదమునందిన సర్కారు ప్రఖ్యాతి, వైద్యవిజ్ఞానవిశేషము దినదినాభివృద్ధియై సర్వత్ర వ్యాపింపఁ దొడంగినది. 'వైద్యసంఘము' యొక్క ప్రారంభోపన్యాసము డా. చక్రవర్తి గారియింట సర్కారుచే నొసంగఁ బడెను. తన యుపన్యాసమున

హోమియోపతీ వైద్యమును నీచాతినీచముగ నిరూపించి, సర్కారు తృణీకరించెను. గంభీరోపన్యాసావేశమున హోమియోపతీ వైద్యముయొక్క తాత్కాలిక విజయము నకును, దదితర వైద్యవిధానముల విజృంభణములకును గారణ మాంగ్లవైద్యుల చేతగానితన మని యతఁ డుద్ఘాటించెను. అచ్చటికి వచ్చినవారంద ఱాతని యుపన్యాసమును శ్రద్ధా భక్తులతో నాలకించి తద్వైద్య సంఘపు టెన్నికలలో డా॥సర్కారునే కార్యదర్శిగ నెన్నుకొనిరి. తరువాత 1866-వ సంవత్సరమున నాతఁడు తత్సంఘమున కుపాధ్యక్షుఁడయ్యెను. ఇతరు లేమనుకొందురను భయములేక తాను సత్యమని విశ్వ సించిన విషయము నుద్ఘాటించుటలో సర్కారు ముందు వెనుకలఁ బరిశీలింపని యతిసాహస వ్యక్తి.

సర్కారున కప్పుడే ముప్పదవయేఁడు దాఁటినది. వైద్య కళాశాలయందు సర్వోచ్చములగు గౌరవబిరుదముల నతఁడొం దెను. యథార్థమైన తనవిజ్ఞానమునకు సరియైన ప్రశంస నతఁడు వైద్యవృత్తిలో గడించెను. ఆతని వైద్యప్రవృత్తి యత్యధికమగుచుండెను. ఆతని చేతిచలువనుగూర్చి యెల్లరు జెప్పుకొనఁదొడంగిరి. 'అమృతహస్తు' 'డమేయవైద్యవిద్యా నిధి' యన్నపలుకు లాతనిని దర్శింపనివారుగూడఁ జెప్పికొన సాగిరి. చిన్ననాఁటి సత్యప్రియత్వము, శాస్త్రజిజ్ఞాస యాత నితో నవినాభావసంబంధముగలిగియుండెను. అంతర్నిగూఢ మైయున్న సృష్టిరహస్యముల నాచ్ఛాదించు మాయావసన మును బటాపంచలుచేయుటయే శాస్త్రప్రయోజనము. శాస్త్రజిజ్ఞాస యనఁగా సత్యాన్వేషణమునకైన తృష్ణయే.

శాస్త్రాధ్యయన మితరాధ్యయనములవలెదనలోఁబరిసమాప్తిని గనఁజాలినది కాదు. సత్యాసత్యముల వివేకమును గలిగించుచు పురుషత్వ స్త్రీత్వములయొక్క సమగ్రత్వమును బొందుటకు వీలయిన సాధనము శాస్త్రము. విశ్వమును బరిశాసించు ముఖ్యసూత్రముల నెఱుంగుట కేకైకమార్గము శాస్త్రము. అంతియకాని శాస్త్రజ్ఞానము గర్వజనకము, ప్రాపంచిక సౌఖ్యదము, మతభావవినాశనకారి మాత్రము కానేరదు. మిథ్యాశాస్త్రజ్ఞానముబ్బును గర్వమునుగలిగించును. సంగోరు విజ్ఞానము కూడ నట్టిదే. కాని సత్యమైన శాస్త్రజ్ఞానము, భగవంతుని సృష్టికార్యముల లవలేశములు కూడ తనకగమ్యమయినవనియు, తన విజ్ఞాన మపరిపక్వము, అసమగ్రము నయినదనియు గ్రహింపఁజేసి, మానవుని గర్వముడిపి, వినీతుని గాఁజేయును. ఇట్టిదని శాస్త్రము నాతఁడు గ్రహించి తనజీవితమును, దనసర్వస్వమును శాస్త్రదేవిపాదపీఠమున సమర్పించి సర్వోత్కృష్టమైన త్యాగముగావించిన యనవద్యవ్యక్తులలో నగ్రగణ్యుఁడై నాఁడు.

డాక్టరుసర్కారు 'వైద్యసంఘోపన్యాసమున' హోమ్యోపతీవైద్యమును దెగడునాఁడు తద్వైద్యచికిత్సా విధానపు ప్రాథమికసూత్రములను గూడ నెఱుంగఁడు. ఆతఁడే తన్నుగూర్చి "నేను నావైద్యవృత్తియందుండు తోడి సోదరుల వలెనే 'హోమ్యోపతీ'యనిన విశేషముగా ద్వేషించి తూలనాడితిని. తూలనాడుటయే కాదు-తద్వైద్యద్వేషులలో నేనగ్రగణ్యుఁడనుకూడ. ఆ వైద్యమునుగూర్చిన యసత్యనిరూపణములమూలమునఁ గలిగిన యనాదరము, సూత్రాతిసూత్ర

ములయిన మోతాదుల ప్రమాణములు హోమ్యోపతీ చికిత్సావిధానాధ్యయనమున విముఖునిగను, తద్వైద్యుల యెడ ద్వేషభావముకలిగినవానినిగను జేసియుండె" నని చెప్పికొనెను. ఇంతటి తీవ్రవాది నొక చిన్న సంఘటనము విచిత్రముగ మార్చివైచినది. ఒకదినమున నొక మిత్రుఁ డాతనికి 'మార్గన్'చే రచింపఁబడిన 'హోమ్యోపతీ వైద్యశాస్త్ర తత్త్వము' అను గ్రంథము నొకదాని నొసంగెను. సర్కారావిషయమును గాఢముగఁ జదివి లోపముల గ్రహించి, శాస్త్రాధారములచే నావాదమును ఖండింపవలయునను పట్టుదలతోఁ బఠించెను. కాని యా 'మార్గన్' యొక్క తార్కికవాద బల మెట్టిదో, సత్య నిరూపణ శక్తి యెట్టిదో, అప్రతిహతములగు వాదము లెట్టివో కాని డాక్టరు సర్కారు గారదీవాని మాయలఁ జూచువానివలె విమోహితుఁడయ్యెను. వెంటనే తచ్ఛాస్త్రసారావగాహనమును సంపూర్ణముగఁ జేయవలయునని యన్నపానాదుల విసర్జించి, వైద్యవిధానమును, చికిత్సా విధానమును, ఔషధ క్రమమును బాగుగాఁ బరిశోధింప మొదలిడెను. హోమ్యోపతీ వైద్యమునకు సంబంధించిన గ్రంథముల నన్నింటి నాతఁడు న్యూయార్కునుండి తెప్పించెను. వానిని నిరంతరము పఠించి, గ్రహించి, గ్రంథములయందలి సత్యములను బ్రయోగసాధనమునఁ గనుగొన యత్నించెను ప్రయత్నించుటయే యాలస్యము-తద్వైద్య విధానమున కాతఁడమ్ముడువడిపోయెను. కోటీశ్వరుఁడును, హోమ్యోపతీ వైద్యమును వంగదేశమునఁ బ్రప్రథమమున నవలంబించి యనుష్ఠించినవాఁడును నగు డాక్టరు రాజేంద్ర

లాలు దత్తు ఆంగ్లవైద్య విధానరత్నమగు సర్కారు భావ పరిణామమును విని యానందించి తన మతమును స్వీకరించిన యతని నభినందింప నేగెను. తన చికిత్సావిధానము నాతని కుపదేశింప వలెనని యాతఁడూహించెను, కాని యట్టి యవసరము సర్కారునకు లేకుండెను. ఆతఁ డప్పటికే కొన్ని యనివార్య రోగముల కా వైద్యవిధానము ననుసరించి చికిత్స నొసంగి, దానివలని ఫలితముల కొఱకు నిరీక్షించుచుండెను. ఆత్మవిఘాతకమగునట్టి పరివర్తనముకు గావింప వలదని డాక్టరు ఫ్రేయరు సర్కారును నిరోధించెనుగాని తన శ్రేయోభిలాషి, తన యాచార్యుఁడు, ప్రపంచ విఖ్యాతుఁడు నయిన డా. ఫ్రేయరు నిరోధ మాతనిఁ జలింపఁజేయఁ జాలక పోయెను. క్రీ. శ. 1867–వ సంవత్సరమున వైద్య సంఘమునం దుపన్యసించుచు వైద్యశాస్త్రమున రోగముల యొక్కయుఁ, దన్నివారకములగు నౌషధములయొక్కయు ననిత్యత్వమును గూర్చి సర్కారు వివరించెను. ఆతని యుపన్యాసానంతర విశేషములు విచిత్రములయినవి. వర్ణించుట కలవికానివి. సహేతుకములు, ప్రయోగమూలములు నగు వానిని గూర్చిన వాదోపవాదముల సందర్భమున ననుచితమయిన సంక్షోభము చెలరేఁగెను. ఒక రోగమునకు ఒకే మందు అని గాఢముగ విశ్వసించు నాంగ్లవైద్య విధానమును బట్టి సర్కారు చెండాడుచుండ తద్వైద్య సంఘ సభ్యులు కింకర్తవ్యతామూఢులై వెల్లమొగములఁ జెవులప్పగించి వినిరి. ఒక యరగంటకుఁ బూర్వము తమ సంఘమున కుపాధ్యక్షుఁడుగా నుండి సభావేదికపై నిల్చి యిట్లిప్పు డప్రియము

లాడువానిని సభనుండి వెడల నడపవలయు నని తత్సభ్యు లూహించిరి. సనాతనులగు నాంగ్లవైద్యుల కుతంత్రము విజయమొందినది. హోమ్యోపతీ వైద్యమును బురస్కరించు కొని వాదించుట యను గొప్ప నేరమొనరించుటచే సర్కారు సంఘ సభ్యత్వమునుండి తొలఁగింపఁబడెను. పిచ్చి హోమ్యోపతీ వైద్యుఁడని యాతని తోడివారలు బరిహ సించిరి. సత్యశోధునకు నిందాస్తుతులతోఁ బనియేమి? సత్యమే యాతని గమ్యము.

## III

## పరీక్షాసమయము

హోమ్యోపతీ చికిత్సావిధానమున సర్కారునకుఁ బూర్ణ విశ్వాసము కుదిరినవెనుక నాతఁడు మనోవాక్కాయ కర్మములచే నా విధానమునే యవలంబించెను. అవలంబన మెట్లాతనికి పరీక్షాసమయమయ్యెనో యాతఁడే యొక సందర్భమున నిట్లు చెప్పెను:

"ఆ సమావేశము జరిగిన మఱునాటినుండి నేను బహిష్కృతుఁడ నయితిని. నాకు మతి చెడినదనియు, సంతవఱకును బ్రపంచమునలేని యొక పిచ్చివైద్యవిధానమునకు విశ్వాసము చూఁపనిచ్చినాఁడ ననియు కింవదంతులు కార్చిచ్చులవలె నంతటను వ్యాపించినవి. నేను నా గణితశాస్త్ర విజ్ఞానము నంతటిని మఱచితినఁట. అంశము పూర్ణముకంటె నధికమని విశ్వసించితినఁట. సమగ్ర విశ్వాసముగలిగి చికిత్స కొఱకు నాకడ కరుదెంచు నసంఖ్యాకులగు రోగి జనులు నేను

నా పూర్వపు విశ్వాసములను పరిత్యజించితినని విచారించి నా వైద్యమునెడ నిర్లక్ష్య భావమును జూపిరి. నా వైద్య వృత్తి యాకస్మికముగ సంపూర్ణముగా నంతరించినది. ఒక యాఱుమాసములు నాకడకు వైద్యమున కొక్క రోగియు రాలేదు. ఒకవేళ వచ్చి యుచితముగా నా సలహాపొందిన వారయినను ప్రాఁత వైద్యము ననుసరించి మందు నొసంగుమని ప్రార్థించిరే కాని నూతన వైద్య విధానము ననుసరింప నంగీకరింపలేదు.''

ఇట్టి క్లిష్ట పరిస్థితు లాకస్మికముగ రూపొంది, యాతనిని పరివేష్టించినను సత్యమునే యాతఁడు సిద్ధాంతముచేసి దృఢముగ దాని నవలంబించి యుండెను. ఆతని శ్రేయోభిలాషు లగు మిత్రులు పలువురు చెవి నిల్లు కట్టుకొని యెంత చెప్పినను డాక్టరు సర్కారొక నూలుపోగంతకూడ చలింపలేదు. ఇట్లు తన్ను నిర్బంధించిన వారల కాతఁడు ''నేను నా వృత్తినే పరిత్యజించెదను గాని నిరూపిత సత్యమును త్రోసిరాజన లేను. నా యీ విశ్వాసమునకు ఫలితముగ నెట్టి యిక్కట్టులు వచ్చినను ధైర్యముతో ననుభవించెదను. లోకమునకు నేను నమ్మినట్టిది సత్యమని ప్రకటించెద''నని యవిచలితమయిన విశ్వాసముతో సమాధాన మిచ్చువాఁడు. హిందూదేశము నందలి వైద్య విధానమున 16-2-1867-వ దినము చిరస్మరణీయమైనది. ఆ దినమున హైందవ వైద్య విధానమును సంస్కరింప నిస్సహాయుఁడై సర్కారు నడుము బిగించి నిలువంబడెను. ఆత్మబలముతక్క వేఱొక బల మాతనికి లేదు. సత్యమే భగవంతుఁడు, భగవంతుఁడే సత్యమని యాతని

నమ్మిక. భగవంతుని చేతి కీలుబొమ్మ తానని యాతఁడెంచు కొనెను. ఆతని యీ యభిప్రాయము, ఆతని జీవిత పరమార్థము – ఈ రెండే యాతని జీవితమును జక్కదిద్దినవి. మానవ బలమున కాతఁ డెన్నఁడును జంకలేదు. దైవ బలము, సత్యబలము—ఈ రెండే యాతనికి ప్రాపులు. ఆతని ధైర్యముతోడి ప్రచారము మూలమున నీ దేశమునందు వ్యాప్తిలోనున్న వివిధ వైద్యవిధానముల నవలంబించు వారిలో నాతఁడు సామరస్యము కలిగించి ధన్యజీవి యయ్యెను.

వంచకులకు దృఢవిశ్వాస హీనులకు కీర్తి ప్రపత్తులు తాత్కాలికములు, క్షణికములుగాని దృఢవిశ్వాసులకు, సత్య ప్రియులకు గౌరవ ప్రపత్తులు శాశ్వతములు. తాత్కాలికాభిప్రాయభేదమున గలిగిన విమతభావము బుద్బుదప్రాయముగా నుండును. ఇది లోకధర్మము. భిషగ్వరుఁడైన సర్కారు యొక్క వైద్యవ్యాపారము వృద్ధ్యున్ముఖమయ్యెను. రోగులు, ప్రేక్షకులు తండోపతండములుగ వచ్చి యాతని భవనాంతర్భాగముల కిటకిటలాడఁ జొచ్చిరి. ఏమందిచ్చిన రోగి కేమి కావలయును? మానినది మందు, మనినది గ్రామమన్నది సత్యముకదా! రోగ నిర్మూలనము, ఆరోగ్యమును నర్థించిన రోగులు వైద్యవిధానమును సరకుచేయుట మానిరి. పూర్వపు వైద్య ప్రఖ్యాతి పునరాగతమయినది. మిన్ను విఱిగి మీఁద బొరిగి పడినను జలింపని దృఢవిశ్వాసముకలవాఁడు, సత్య పరతంత్రుఁడు, భయరహితుఁడు నను జయజయ ధ్వనులతో సర్కారు కలకత్తా నగరమందలి వైద్యులకెల్ల శిఖామణియై యలరారెను.

ప్రతిభా సంపాదకత్వము - ప్రచారము:

అహంకార నిరసనము మహోదార చరిత్రులకు వెన్నతోఁ బెట్టినది. ఆత్మ ప్రశంస చేయక తప్పని సరియయిన నప్పుడు సర్కారు లజ్జాపూరితుఁడై ప్రసంగించెడివాఁడు. తన యాగ్నత్యము స్వల్పమయినదనియుఁ, దాను పూని నిర్వహించు కార్యముయొక్క ప్రాధాన్య మెక్కువైనదనియు నాతఁడు భావించువాఁడు. శాస్త్రప్రాముఖ్యమునకు నిరసనము రానంతవఱకుఁ దానెన్నడును పులుముకొని ముందడుగు వేసెడువాఁడు కాఁడు. మానవహృదయము స్వల్పమైన పరిధి గలిగినదనియు నందు సమాన ప్రభతో వస్తుద్వయము ప్రకాశింపలేదనియు నాతఁ డెఱుంగును. అందుచేతనే శాస్త్ర విజ్ఞాన ప్రాముఖ్యమునకు నాత్మ ప్రాధాన్యమును బురస్కరింప రాదని యాతఁడు భావించెను. అందుకొఱకే శాస్త్రవిజ్ఞానాభివృద్ధియే ప్రయోజనముగాఁ గలిగిన శాస్త్రజ్ఞుఁడు ఆత్మ ప్రాధాన్యమును బరిమార్జింపవలయు నని యాతఁడు గ్రహించెను.

డాక్టరు సర్కారు రాజప్రతినిధియు, పలువురున్నతోద్యోగులును, ప్రఖ్యాతులైన యూరోపియనులును, దేశీయ ప్రముఖులును గుమిగూడి యుండిన సభలో విజయనగరము నందలి శాస్త్ర కళాశాలకు ప్రతిష్ఠ చేయుచుఁ దన్నుగూర్చి ప్రథమ పురుషలో "ఆతని యెడ నత్యద్భుతమైన కుశాగ్ర బుద్ధిలేదు. కాని విజ్ఞానార్జనమునకుఁ దీరని పిపాస కలదు; శాస్త్రవిజ్ఞానాన్వేషణమునకు నుత్సాహపూర్వకమయిన యభినివేశము కలదు. శాస్త్రసంపద నార్జించుట యన్నను,

నార్జించిన సంపదను వెదజల్లుటయన్నను నాతని కత్యధికమయిన సంతోషము, తాను బొందిన విజ్ఞానానందము నెల్లరకుఁ బంచిపెట్టవలెనని యాతనికిఁ దీవ్రమైన సంకల్పము కల"దని యుపన్యసించెను. నిజముగా నిదియే యాతని జీవిత రహస్యము. అతఁడు తన జీవితమును సత్యవిచారణమునకును, తత్త్వబోధనమునకును సమర్పించెను. ఆతని యనంతాధ్యయన మనవద్యమైన శక్తులను, శిక్షణను బ్రసాదించినది. ఆ జిజ్ఞాసయే యాతనికి బ్రకృతిలోని తత్త్వముతో సన్నిహిత సంబంధమును గలిగించినది. వెదకివెదకి యీ మహనీయుఁడు శాస్త్రవిద్యాదీపికను గరమున గ్రహించెను. ఆ దివ్య వెలుఁగులచే దేశీయుల హృదయ కుహరములందలి తిమిరమును, అజ్ఞానమును, మూఢ విశ్వాసములను, అనుమానములను బటాపంచలు చేయుదాక నాతఁడు హృదయశాంతి వహింపఁజాలఁడాయెను.

"మన దేశీయులు బహు శతాబ్దులుగా నుండిన విదేశపరిపాలనమువలనను, నమిత నిరుత్సాహకరమయిన మతపరిస్థితులవలనను నధఃపతితులై యజ్ఞానమున నల్లాడుచున్నారు. మన మతము సర్వమతముల సారము వహించి మనస్సు నైహిక పదార్థముల నుండి దూరముగాఁ జేయునదైనను, గాలక్రమమున భిన్నజాతి ధర్మాదుల సంపర్కముచే సంకీర్ణమగుట సంభవించినది." అని యాతఁడు మన మతమును గూర్చి ప్రసంగించియుండెను. తత్త్వాన్వేషణ పరునకు మత స్వరూపము - అందును విభిన్నమైన యీ హిందూమతము - ఇంతకంటె వేఱువిధముగా గోచరింపదు.

డాక్టరు సర్కారు క్రమముగాఁ దన నూతన వైద్య పద్ధతిని ప్రచారములోనికిఁ దెచ్చెను. అతని సమకాలికులచే నతని సిద్ధాంతములే యా వైద్య విషయమున ప్రమాణము లుగా నంగీకరింపఁబడెను. తద్వైద్యోపయోగము నెల్లు వ్యాపింపఁజేయుట యని యాతఁడు సంతత మాలోచించు చుండెడివాఁడు. "మానవుల కత్యుపయోగకరమయినదిగా నంగీకరించిన యీ వైద్యమును నే నభ్యసించుచు సంతుష్టి పడియుండరాదనుట స్పష్టము. తచ్చికిత్సావిధానమును, దాని యభ్యాస ప్రచారములను నాకు శక్తిగలిగినంతవట్టు, తోడి వైద్యులయందును, ప్రజలయందును వ్యాప్తిచేయవలసిన బాధ్యత నాయందున్నది. 'మెడికల్ గెజెట్' పాక్షికపత్రిక యగుటచే దీనికి మేలైన సాధనము కాదు. వైద్య పత్రికల ద్వారా కాక యితర పత్రికల ద్వారా ప్రచారము చేయుట గౌరవహానియే కాక యుచితముకూడఁగాదు. అందుచే నా కోరికను సఫలీకరించుకొనవలయునన్న నాకొక పత్రిక యుండవలయును. ఈ యభిప్రాయమే దృఢపడి పత్రిక నొకదానిని స్థాపింపవలయుననుపూనిక నాలో స్థిరమయిన" దని యాతఁడు పత్రికా స్థాపనమునుగూర్చి వచించెను. 1868-వ సంవత్సరమున స్వతంత్రముగఁ 'గలకత్తా వైద్య పత్రిక 'యని యొకటి నాతఁడు ప్రారంభించెను. ఈ పత్రిక వంగ దేశమున హోమ్యోపతీచికిత్సావిధానమును వ్యాప్తముచేయు టకును, బరస్పర వైద్యులలో సామరస్య భావమును బెంపొం దించుటకును, వైద్యులలో నతి సనాతనమైన'సంచికట్టు'వైద్య విధానమునురూపఱచేయుటకును మిక్కిలి పాటుపడినది. డాక్టరు

సర్కారు మనోరథము కొంతవఱకు దీని మూలమున నీడేరినదనుటలో సంశయము లేదు.

తన విద్యా కృషి సస్యమును మిత్రులకుఁ బంచకుండ స్వార్థపరుఁడై యుండుట సర్కారెఱుంగఁడు. ఆతని యలౌకిక ప్రతిభతోడి కార్యోత్సాహమును, దీక్షయు నతనికిఁ బ్రపంచమునందలి మేధావులతో బరిచయము కలిగించెను. సర్కారప్పటి విద్యావిధానమును గూర్చి విమర్శించెను, అయ్యది నిష్ప్రయోజనమును, కలుషీకృతము నని యాతనికిఁ దోఁచెను. శాస్త్ర విద్యాబోధనము దేశమున కత్యంతావశ్యక మని యాతనికి బోధపడెను. 'మిల్' పండితుఁడు వ్రాసిన గ్రంథము నితఁడు పఠించిన వెనుక నీతనియందుఁ గలిగిన సంస్కార ప్రభావమే యీ యాశయమునకు మూలము. ఈ యభిప్రాయమే క్రమముగా నాతనియందు నిరూఢమయినది. ప్రకృతిపదార్థ శాస్త్రావలంబనము మూలముననే హిందూబుద్ధి సమగ్రవికాసము నొందఁగలదని యాతఁడు వచించెను. ఈ కార్య మూహామాత్రమునఁ దోఁచిననాఁడే, దీనినిఁ బ్రత్యక్షముగఁ గార్యరూపమున సాధించుట సులభము కాదని యాతఁ డెఱుంగును. శాస్త్రము తన యస్ఫుటాచ్ఛాదనమును దొలఁగించి రహస్యముల బోధించిన మనోహర దృశ్యములు హృదయాకర్షకములుగా నుండక నసహ్య భౌతిక సూత్రములకుఁ దావొసంగు నని యచ్చటచ్చట సనాతనులగు పెద్దలు వాకొనునట్టి పలుకు లాతని శ్రుతిపథమునఁ బడకపోలేదు. అట్టివానికి ప్రతి సమాధానముగా నాతఁ డిట్లు వచించెను.

"పదార్థ సూత్రములు వాని సౌందర్యమును, ప్రకాశ మును, వైశాల్యమును, గభీరతను గ్రహింప శక్తిలేనివారికి, మనోజ్ఞములు కాకపోవుట సత్యమే. మన యూహా కంద రానివై యుండు శక్తులను, నపరిమితమైన బుద్ధి విశేషమును గ్రహింపఁజాలనివారి కవి యానందమును గలిగింపవు. దుర్భిణీ, దూరదర్శనులయందుఁ బ్రతిబింబితములైన రహస్య ముల నెఱుఁగనివాఁడు కవి కానేరఁడు: శాస్త్ర విజ్ఞాన దర్పణమునఁ దిలకించి దృశ్యముల విశేష రమణీయత్వమును దెలియలేనివాఁడును గవి కానేరఁడు. పండితాగ్రేసరుఁడయిన 'కాలెర్జి' తన భావన పెంపొందించుకొనుటకు 'సర్ డేవీ' శాస్త్రజ్ఞుని యుపన్యాసముల వినుచుండువాఁడు. కాలెర్జి సామాన్యకవియా? అమరకవి కోటీమాత్రము తక్కువ వాఁడా?...ఆతఁడు వివరించిన శాస్త్రజ్ఞాన సర్వస్వమెచ్చటి నుండి గ్రహింపఁబడినది? శాస్త్రము జీవకవిత్వము - మాన వుఁడు సృజించిన కొలఁది నది మనోజ్ఞముకాఁగలదు. శాస్త్ర వృద్ధివలన మానవుని యుత్తమ స్వభావము బాధిత మగునని తలంపరాదు. మానవుని యుదార భావములు శాస్త్ర వివ రణమున నష్టము నొందుననియు నే విశ్వసింపను......... .........శాస్త్రజ్ఞాన మెన్నఁడును మిథ్య కానేరదు. శాస్త్రము మూఢ విశ్వాసముపై నాధారపడినది కాదు. సత్యముపై నిర్మింపఁబడినప్పు డయ్యది యసత్య మెట్లగును?... ......భగవంతుని మానవుఁడు సవ్యముగా స్తుతింపవలయు నన్న - స్తోత్రపాఠముల వల్లెవేయుటకాక శరీరశాస్త్రమును

రచించి భగవద్రహస్యమును వివరించుట యాతఁడు చేయవలసిన పని"

శాస్త్ర, తత్త్వశాస్త్రములయందు నిట్టి స్పృహాభిప్రాయములతో డాక్టరు సర్కారు "దేశమునకుఁ బరమోపాయము మూఢ విశ్వాసముల విసర్జించి యుత్తమ జ్ఞానావలంబన మొనరించుటవలనఁ గలుగును. శాస్త్రాభ్యాసము మన దేశీయుల కావశ్యకమని నేఁ జెప్పునది వారి యభివృద్ధికొఱకే కాక వారి పునరుజ్జీవనమునకుఁ గూడ నైయున్నది. దీనిచే శాస్త్రజ్ఞానార్జనము చేయుఁడని దేశీయులఁ బ్రబోధించుటకై జీవితమును సమర్పింప నిశ్చయించెడివాఁడనుగా" నని పెద్దల సభలో నుపన్యసించెను. శాస్త్రమునెడ నాతని యాదరాభిప్రాయములు దినదినాభివృద్ధినొందుచుండెను.

శాస్త్ర శోధనకుఁ గాల విలంబనము బాధాకరముగ నుండును. ప్రయోగశాలలు క్షుధాపీడితుల రూపఱఁజేసి సంపత్సమృద్ధి నొసంగును. తనకుఁ దీరికయయిన వేళల సాయంసమయములయందు డాక్టరు సర్కారు తన గృహమునందే యిరుగుపొరుగు వారలకును, కొందఱు విద్యార్థులకును శాస్త్రవిషయములఁ గూర్చి యుపన్యసించుట కారంభించెను. శ్రోతల యుత్సాహమున కాతఁడు తన్మయుఁడగుచుండెడివాఁడు. దినదినము వృద్ధినొందు శ్రోతల సంఖ్య సర్కారు నాశల వృద్ధినొందించెను. ఆతని భావన యుజ్జీవమొందెను. ఆతని హృదయమున నాశాజ్యోతి వెలిఁగి దేశమునం దంతటను బంగారు వెలుఁగులఁ బ్రసరింపఁజేసినది. "జపాను దేశము మన ముచ్ఛ్రితియందుండునాళ్లు నామమాత్రావశిష్టమయి

నది. అంతట నది యుగధర్మము నవలంబించినది. వెంటనే ప్రపంచమునందలి యితర జాతులతోడి సాహాయ్య సంపద నొంది రాజిల్లినది. హిందూదేశ మేల తదుదాహరణముఁ గైకొని ముందంజ వేయరా'' దని యాతఁడు ప్రశ్నించు కొనుచు శాస్త్రసంస్థ నొకదానిని స్థాపించి హిందువుల లోపము తీర్పవలెనని యొక దృఢనిశ్చయమునకు వచ్చెను. నిశ్చయమునకు వచ్చుటయే తడవుగా సర్కారు 'కలకత్తా వైద్య పత్రికలోఁ జక్కని శైలిలో భావములు పొదివి శాస్త్ర సంస్థాస్థాపనావశ్యకమును బురస్కరించుకొని యొక వ్యాసము ప్రకటించెను. ఈ వ్యాసముతోడనే హిందూదేశమున నొక నూతనశకమవతరించినదన్న సాహసము కానేరదు. ఈతని వ్యాసము యొక్క ఫలితముగాఁ గలకత్తా విశ్వవిద్యాలయమున బి. ఏ. తరగతులయందు శాస్త్ర మైచ్ఛిక విషయముగాఁ బ్రవేశపెట్టఁబడినది. దీనితో సర్కారు ప్రయత్నము బీజాంకురము నొందిన దనవచ్చును. అతఁడసామాన్యుఁడైన దేవదూతయా యనిపించెను. శాస్త్ర విద్యాబోధనకే యాతఁ డవతరించెనని ప్రజలు తలపోసిరి.

వైజ్ఞానిక సమాజము యొక్క యావశ్యకమును గూర్చి 1869వ సంవత్సరమునఁ దొలుత పత్రికలలోఁ బ్రకటింపఁబడినది. దేశమున ధనికులు లేకపోవుటగాని, దాతృత్వము మృగ్యమయి కాని, లోకోపకారపరాయణులు, దేశభక్తులు లేక గాని యిట్టి యుత్తమ సంస్థలు నిస్సహాయత నొందుటకుఁ గారణములు కావు. లోకమున కేమి యయిన మన కేమి యను నుదాసీనభావముగలిగిన వారుండుట యొక కారణము.

అయినను వ్యవస్థాపకుఁడు, కార్యదీక్షా ధురంధరుఁడు, ప్రతిష్ఠాపరుఁడు, ప్రజాప్రీతిఁ గలిగినవాఁడును నై యుండిన నెంతటి దుర్ఘట కార్యమైనను సులభసాధ్యము కాఁగలదు. డా. సర్కారు రేపవళ్లు తదేక పరత్వమున వైజ్ఞానిక సమాజ స్థాపనమునకై పాటుపడఁజొచ్చెను. ఆతఁడు తీవ్రమయిన యాందోళనము సాగించుచుండ దావశ్యకమును గూర్చి యుపన్యాస పూర్వకముగా జ్ఞానప్రబోధము గావించెను. ఎంత ప్రయాసపడి యెన్ని సభా వేదికలపై గొంతుక చించుకొని యుపన్యాసముల నిచ్చి విసిగి వేసారినను నాఁటికిఁ బ్రయోజనము లవంతయు నగుపించలేదు. ఇట్టి యంతరాయములకు సర్కారు భయపడి కార్యమును విడుచునట్టి యధీరుఁడు కాఁడు. దేశము నందున్న సర్వజనుల యుదార స్వభావమునకుఁ బాత్రమయిననాఁడే యియ్యది కార్యరూపము నొందఁగలదని యాతఁడెఱుంగును. విద్యావంతుల యొక్కయు, ధనవంతుల యొక్కయు, సామాన్యుల యొక్కయు, నధికారుల యొక్కయు సాహాయ్యము, సానుభూతియు సంస్థాస్థాపనమున కావశ్యకమని వారందఱితోడను బరిచయము నాతఁడు సంపాదించెను. సర్ రిచర్డు టెంపుల్ ఆకాలమున బంగాళమున లెఫ్టినెంటు గవర్నరుగా నుండెను. ఆతనికి విద్యావిషయములన్నను, నిశిత వైజ్ఞానిక విమర్శనలన్నను మిక్కిలిప్రీతి. సెంట్ జోవియర్ కళాశాలలో జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు, భౌతిక శాస్త్రజ్ఞుఁడు నయిన ప్రొఫెసరు లేఫంటు సహాయసంపదను డా. సర్కారు చూఱగొనెను. పండితుల యాదర మున్న దన కార్యమునకు సరిపడదనియు, ధనవంతుల సానుభూతి కూడ

నవసరమనియు సర్కా రెతింగిన వాఁడగుట, ధనవంతులకు జ్ఞానప్రబోధము నంబాదరము కలుగునట్లుచేయుట యెట్లని యాలోచింప మొదలిడెను. కార్యము యొక్క ప్రాముఖ్యము, ప్రయోజకత్వము ముఖ్యగునవి విజ్ఞులసానుభూతిని సంపాదింపఁ గలవు. కోటికి పడగెత్తిన ధనవంతులను, భూస్వాములై ధనార్జన మొనరించుట తప్ప నితరమేమియునెఱుంగని జమీందారుల నీ విషయమునందాసక్తులనుగాఁ జేయుట యెట్లు? అట్లు చేయక తన కార్యము సఫలీకృతముకాదే? వర్తకులు ధనవంతులు ప్రభువులు బిరుదములన్న పడిచత్తురు. అధికారులన్న పడలుదురు. వారధికారుల చిత్తములకు వ్యతిరేకముగఁ బ్రవర్తింపఁజాలరు. అందుచే నీకార్య సాఫల్యమునకు నధికారయుతమయిన ప్రచారము కావలయునని డా. సర్కారు గ్రహించెను. 1876సం. జనవరి 15వ తేదీని లెప్టినెంటు గవర్నరుగారు వైజ్ఞానిక సమాజమునకు ప్రారంభ మొనరించిరి. ఆదినము హిందూదేశ చరిత్రమున స్వర్ణాక్షరముల లిఖింపఁదగినది. ఈ ప్రారంభముతో డా. సర్కారు మనోరథము మొలకెత్తినట్లయినది. అది పెద్దదై పుష్పించి ఫలించు టెప్పుడో! శ్రద్ధాపూర్వకముగ శాస్త్రప్రియులగు వైజ్ఞానికులందఱును శాస్త్రపరిశోధకులుగానుండి నూతనములయిన పరిశోధనలు గావించి లోకమున కాశ్చర్యము గలిగించుట నిక్కువమే. కాని డా. సర్కారా పద్ధతికి నపవాదము. ఈతఁడు శాస్త్రప్రియుఁడు మాత్రమే. ఎట్టి పరిశోధనలను జేసి తానెఱుంగఁడు సరిగదా, యెన్నఁడును పరిశోధనకుఁ బూనుకొన్నట్లు కూడఁ దెలియరాదు. డా. సర్కారు "పాశ్చాత్యుల యాధిక్య

మంతయు వారి శాస్త్రజ్ఞానము నందును, శాస్త్ర పరిశోధ
నలయందును నున్నది. అట్టి శాస్త్ర జ్ఞానమును మునుముందు
మన దేశీయులలోఁ బ్రచారము చేసినచో మనవారంద ఱుపస్థిత
మైయున్న పాశ్చాత్య శాస్త్రజ్ఞానము నెఱింగి, తరువాత
స్వీయపరిశోధనలచే వారల నతిక్రమింపఁజాలుదురు. శాస్త్ర
జ్ఞానము దేశమున కత్యంతావశ్యకము. పేరుప్రతిష్ఠలు లేని
జపాను, శాస్త్రపరిశోధనల నెఱింగి పాశ్చాత్యులతో సమ
త్వము నొందినది. మన దేశమేల యట్టి ప్రయత్నమునకుఁ జొర
బడరాదు? పాశ్చాత్యుల శాస్త్ర జ్ఞానము కనుల మిఱుమిట్లు
గొల్పుచున్న దే''యని యాతఁడు భావించి శాస్త్రజ్ఞాన ప్రచా
రమునకుఁ దన జీవితమును సమర్పించిన వాఁడయ్యెను. అందు
చేతనే యాతఁడు నూతన పరిశోధనలకుఁ బూనుకొనలేదు.
ఒక్క పరిశోధనము కొన్ని వందల వత్సరములు పట్టును.
పరిశోధితమైన జ్ఞానముయొక్క యాధారము కలిగిన మిగిలిన
జ్ఞానము నార్జింపవలెనను తృష్ణ తనంతట దానే కలు
గును. అందుచే డా. సర్కారు అందనిమ్రాని పండ్లకు కఱ్ఱు
సాచునట్టివాఁడు కాలేదు. అతఁడు కార్య కారణములను సూక్ష్మ
ముగా గుణించి గణించువాఁడు. శాస్త్ర రంగమున నాతఁ
డుపస్థితమయిన శాస్త్రవిషయములను వివరించి బోధించునట్టి
వాఁడు. అతఁడు హిందూదేశమున శాస్త్ర దేవతాలయమున
ముదుసలిపురోహితుఁడు, మతాచార్యుఁడు నైనాఁడు.

డా. సర్కారు జన్మతః గొప్ప యుపాధ్యాయుఁడు.
వైజ్ఞానిక సమాజమున నొసంగఁబడు నాతని యుపన్యాసముల
విన్న విద్యార్థుల కెల్లరకును నిది విదితము. వైజ్ఞానిక సభాప్రా

రంభ దినమున నాతని యుపన్యాస మద్వితీయమయినది. ఆసభకు నధ్యక్షత వహించి 'రిచర్డు టెంపులు' శాస్త్రపార కాలకుఁ దగినవాఁడు డా. సర్కారొక్కఁడేయని యతని బోధశక్తి నుగ్గడించెను. ఈతఁడెంతటి బోధకుఁడో యంతటి ప్రయోగనైపుణ్యము కలిగినవాఁడు కూడనై యుండెను. ఈతని ప్రయోగనైపుణ్యమున కచ్చెరువంది యప్పటి రాజప్రతినిధి యైన లార్డులిట్టన్ ప్రభువు తన భవనమున కాతని రావించి ప్రయోగాత్మకమైన యాతని యుపన్యాసమును విని ముచ్చటపడెను. ప్రథమమున వైజ్ఞానిక సమాజపు టుద్దేశములు విద్యార్థులకు శాస్త్రజ్ఞానమును ప్రసాదించుటయు నుత్తమ శాస్త్ర నిష్ణాతులు తయారయిన వెనుక వారి మూలమున శాస్త్రజ్ఞానమును దేశమున వెదజల్లుటయును నై యున్నవి. ఇది కాక శాస్త్రపరిశోధనలకు హిందూవిద్యార్థులన ర్హులన్న వారు సిగ్గుపడునట్లు శాస్త్రజ్ఞానార్జనముపట్ల తదితరుల వలెనే, మనవిద్యార్థులుకూడఁ గుశాగ్రబుద్ధులని లోకమున కెఱుకపరచెను. డా. సర్కారు తన దేశీయులందఱు గారడీవాని యింద్రజాలిక క్రియాకలాపములఁ జూచి కనులప్పగించి పోవు వారివలెగాక శాస్త్రరహస్యములను నెఱిఁగినవారు కావలయుననియు, సోమరులై యుండుట తగదనియు పదేపదే వారికి బోధించెను. ప్రపంచ వైజ్ఞానిక మండలిలో మనవారును నర్హస్థానము నొందవలయునని యాతని యాశయము. ఉదారాశయములతో నిండిన యాతని వైజ్ఞానిక క్షేత్రము ప్రజ్ఞావహములును, బరిమళవంతములునగు నన పుష్పములను పూయగలదనునాశ యాతనికి జనించెను. ఆతని జన్మము

ధన్యమయినది. ధన్యతమ జీవితుఁడైన యాతఁడు హిందూదేశమందలి వైజ్ఞానిక విద్యకు పితామహుఁ డయినాఁడు.

## IV

### వైజ్ఞానిక సమాజము: శాస్త్రజ్ఞానవ్యవసాయము

డాక్టరు సర్కారునకు వైజ్ఞానిక సమాజము నెలకొల్పు నప్పుడు 'సర్ డేవిడ్ బ్రూయిస్టర్' స్థాపించిన పాశ్చాత్య సమాజపు దృష్టి హృదయమున నుండెను. ఈ సమాజపు నిర్వాహణము, కార్య కలాపము ప్రభుత్వముక్రిందకాక సంపూర్ణముగా సామాజికుల యధికారము క్రింద నుండి పూర్ణ స్వాతంత్ర్యము నొందియుండవలయును.ఇయ్యది జాతీయము, దేశీయము నై యుండవలయునని యాతనిచే సంకల్పింపఁబడినది. అందుఁదొలి దినములలో హిందూశాస్త్రజ్ఞులనే యుపన్యాసకులుగ నిర్ణయింప వలయునను నిర్బంధము కల్పింపఁబడినది. కాని యట్టి శాస్త్రవిద్వాంసులు హైందవులం దెందు కలరు? ఆదినములలో శాస్త్రాభ్యాసము శైశవ స్థితియందున్నది. ప్రజలలో శాస్త్రజ్ఞానమే మృగ్యము. అయస్కాంతమును జూచి యబ్బుర పాటొందునట్టివా రాకాలమువారు. శాస్త్రజ్ఞానము వైద్యకళాశాలలోఁ జేరిన వారికిఁదప్ప నితర విద్యార్థులకుఁ దెలియదు. కార్య నిర్వాహక వర్గము వారు వైజ్ఞానిక సమాజమున హిందూ శాస్త్రజ్ఞులనే నియమింప వలయునను దృఢాభి ప్రాయమున నున్నారు. జాతీయ భావ ముండుట యుత్తమమే. కాని యట్టి సమాజమున హిందూ శాస్త్రజ్ఞుల కుపన్యాస మిచ్చుటకు సాధ్యమగునా? భౌతిక

శాస్త్ర జ్ఞాన పరిచయము కలిగిన వారే తక్కువ. పోనీ ! కలిగినవారయినను సుస్పష్టముగను, మనోహరముగను బోధింపఁగలిగినవారెందరు? అందుచేత డాక్టరు సర్కారు చాల తీవ్రముగ నాలోచించి సంఘ సభ్యుల కంగీకారము కాకున్నను బోధనమునకు మాత్రము హిందూ శాస్త్రజ్ఞులు పనికిరారని వాదించెను. విద్యావిషయము, శాస్త్ర జ్ఞానార్జన విషయము సమాలోచించుపట్ల దేశభక్తి జాతీయతలఁ బురస్కరించుకొని మొండిపట్టు పట్టరాదు. ప్రపంచమునందలి గొప్ప శాస్త్రజ్ఞులు గాని, మేధావులు కాని, యొకే దేశమునకు గాని, జాతికి గాని సంబంధించినవారు కారు. వారు మానవ లోకమున కంతటికి సమాన స్వామ్యముగల వ్యక్తులు. జాతి ప్రత్యేకత కొఱకుఁ బడిచచ్చు జర్మనీ దేశము తన విజ్ఞాన మనల్పమయిన దయినను, పరిశోధనలను జరిపించుటకును, విద్వత్త నార్జించుటకును, బాహాటముగా, నెల్లర విద్వాంసులను వినియోగించు కొనినది. ఇది సమంజస బుద్ధియని డా. సర్కారు చెప్పినను దోడివారికిఁ దట్టినది కాదు. పాశ్చాత్య శాస్త్రజ్ఞుల సాయమును సర్కార పేక్షించి వారల నాహ్వానించినప్పుడు సర్కారు మూలోద్దేశములకు భిన్నముగాఁ బ్రవర్తించుచుండెనని కార్య నిర్వాహక సభ్యు లేవగించుకొనిరి. వారికి సమాధానముగా సర్కారు "మనవారింకను శాస్త్ర ప్రాథమిక విషయములనే నేర్చుకొనవలసియున్నది. మనవారి యభ్యుదయమును గోరియే ఐరోపీయ పండితుల సాహాయ్య మపేక్షింపవలసియున్న" దని మృదువుగనే వారలతో వాదించి తన యభిప్రాయమునందు వార

లకు సానుభూతి కలుగునట్లొనర్చి వైజ్ఞానిక సమాజము శాస్త్రపాఠములను విద్యార్థులకుఁ జెప్పునట్టిదికాక నూతనములైనవియు, స్వీయములైనవియు నగు పరిశోధనల నొనరించునట్టిదిగా నిర్ణయించెను. అంతియకాక శాస్త్రవాసన నెఱుంగని విద్యార్థులకొఱకు వైజ్ఞానిక సమాజమునుండి యాచార్యులను శాస్త్రబోధనలు చేయఁబంపుటకై యాతఁడు శాస్త్రజ్ఞానము వ్యాప్తముచేయ సంకల్పించెను.

సత్కార్యాచరణమున కంతరాయములు పెక్కు. సర్కారారు సంవత్సరములు తదేకదీక్షతో సమాజము కొఱకు పాటుపడెను. మానవప్రయత్న మెంత యున్నను దైవ ప్రయత్నము లేకున్న నది నిష్ప్రయోజనము. సర్కారు ప్రయత్నములకు భగవంతుఁడు దోహద మొసంగినాఁడు. ఉదారుఁడగు 'కాళీకిస్సాన్ టాగూరు' 25 వేల రూప్యములను శాస్త్రపరికర సంపాదనము కొఱకును, 5 వేల రూప్యములను సమాజపు నిధికిని, 2500 రూపాయలను భవనమునకును నొసంగి సమాజమున కొక రూపము నొసంగి పుణ్యము కట్టుకొనెను. అతని యీవి మూలమున శాస్త్రోపన్యాసముల కొక రంగమేర్పడినది. విజయనగర మహారాజులుంగారు భవన నిర్మాణమునకగు వ్యయము నంతను భరించి తమ యౌదార్యమును గనఁబఱిచిరి. ఇట్టి యుదారాశయుల యొక్కయు, శాస్త్రవిద్యాభిమానుల యొక్కయుఁ బ్రోత్సాహములేని నాఁ డే సంస్థ కొనసాగఁగలదు ?

వైజ్ఞానిక సమాజ స్థాపనము జరుగు దినములలోఁ గలకత్తాలోని కొందఱు విద్వాంసులు దైనందిన జీవితమున

కవసరములగు ప్రతి విషయమునకును హిందూదేశము పాశ్చాత్య దేశములపై నాధారపడియున్నది. ఈ పరాధీనత మిక్కిలి దీనముగానున్నది. పూర్వము ప్రపంచమునందన్ని దేశములకును నాగరికతా దీపముల నెత్తిన మన కీయస్వాతంత్ర్యము గర్హ్యమయినది. అందుచే దేశమున కీతరుణమున శాస్త్రవిజ్ఞానాభివృద్ధి కాక శాస్త్రసాహాయ్యమున వస్తూత్పాదనమును జేయుటయే కావలసియున్నది. ధనవంతులు, పాశ్చాత్యులు కృషిచేసి సంపాదించిన శాస్త్రము నభ్యసింపవచ్చును గాని సామాన్యునకా విజ్ఞానముతోఁ బనియేమి? శరీరపోషణమునకుఁ గడంగక యాత్మవికాసమునకుఁ బూనుకొనుట చాల శోచనీయ''మని తమ యుత్సాహమును మాఱుత్రోవలఁ బోనిచ్చి దుర్బుద్ధితో సర్కారు ప్రయత్నముల కంతరాయమును గలిగింప వలయునని తీవ్రాందోళనమును జరుపుచువచ్చిరి. "డాక్టరు సర్కారుయొక్క వైజ్ఞానికసమాజ మీ కాలమున కుపకరించునది కాదు. ఇది దేశమునకు మోయఁజాలని భారమును గలిగించుచున్నది. అట్టి వ్యవస్థయే యీ దేశమున కవసరము కాదు. ఒకవేళ అవసరమయినచోఁ బదియేండ్లుపోయిన తరువాత నవసరపడునేమో! మన పల్లీపట్టణములు నిర్జనములై శోభాదరిద్రాణములుగానున్నవి. గొప్ప యింటివారుకూడ నెక్కుగుమ్మము దిగు గుమ్మముగా బిచ్చమెత్తుకొనుచున్నారు. అందుచే దేశమునకుఁ గావలసినది పారిశ్రామిక విజ్ఞానమును, వృత్తి విద్యను బోధించు సంస్థలు గాని వైజ్ఞానిక సమాజములుగావని వారి యుద్దేశము. పాపము నిద్రాహారములు మాని రేయింబవళ్లు సర్కా రాచరించిన

శాస్త్రప్రచారమును బురస్కరించుకొని యావిచిత్రవాదుల సంఘము స్వార్థమును గొనసాగించుకొనఁ దలంచెను. తమ కార్యమును నిర్వహించుకొనుటకు వారికిఁజక్కని సమయము తటస్థించెను. అప్పుడే దేశమునకు రానున్న బ్రిటిషు యువ రాజుగారిచే దమ సంస్థయొక్క ప్రారంభమును జేయింపవల యునని యప్పటి గవర్నరయిన సర్ రిచర్డు టెంపులు సమ్మతిని వారుపొందిరి. ఈ యుత్సాహముతో వారు దుష్ప్రచారమునకుఁ బ్రారంభించిరి. సర్కారు ప్రయత్నములను, నాతని యాశయములను వ్యక్తిగతముగాఁ గాఢముగాఁ దెగడ నారంభించిరి. సర్ రిచర్డుటెంపులు ఆధిపత్యమునఁ బెద్దలను బలువురను బ్రోగుచేసి వారు సభలు కావించిరి. తీర్మానములనుపపాదించి రెండు లక్షరూపాయలను వసూలు గావించుటకు ప్రయత్నములుచేసి చందాలు వేయించిరి. వారి యాశయముతోడి సంస్థయే దేశమునకు నావశ్యకమని స్థానిక పత్రికలన్నియు నుద్ఘోషించినవి.

మిత్రరూపమున వచ్చు శత్రువు మిక్కిలి భయాస్పదుఁడన్నది చాల నిజము. హిందూసంఘమని పేరిడుకొన్న యా ప్రతివాదిసంఘ మట్టిది. తమ ప్రయత్నములకు డా. సర్కారచలుఁడై యుండుట గ్రహించి వారు జనులను మోసగించుటకై వైజ్ఞానిక సమాజప్రయోజనమును తమ సంఘ ప్రయోజనమును వేఱుగాదని సర్వత్ర ప్రకటించుచువచ్చిరి. ఫాదర్ లాఫాంటు మున్నగువారు డా. సర్కారు సమాజమునకుఁ బ్రత్యర్థిసంఘమును సహింపఁజాలక పోయిరి. వారు సర్కారున కండయై నిలిచిరి. హిందూ సమాజపు సభ్యులు

రెండు సంఘములను సమ్మేళనము చేయవలసినదిగాఁ గోరిరి. ఒకటి సిద్ధాంత ప్రచారమును, వేఱొకటి ప్రయోగ సాధనమును నాశించుచున్నది. ఈ రెండును నొకదానిపై నొకటి యాధారపడియున్నవి. ఒండువిడిచి వేఱొకటి స్వతంత్రముగా నుండఁజాలదని వారు చెప్పుచువచ్చిరి. రెండు సంఘముల ప్రధానోద్దేశములు దేశదారిద్ర్యమును బారఁద్రోలుటయే కనుక రెండు సంఘములను నేకసంఘముగాఁ జేసి నిర్వహించినచోఁ బూర్వముకంటె నూతన తేజముతోను, నుత్సాహముతోను సంఘోద్దేశములను నిర్వహింప వచ్చునని వారు చెప్పుచువచ్చిరి. ఇంతియ కాక సంఘద్వయ సమ్మేళనమునకు డా. సర్కారు నంగీకరింపఁ జేయవలసినదని వారు పలువురు పెద్దలను బంపిరి. కాని సర్కారట్టి బలవంతపు మాటలకు లొంగిపోవునట్టి వాఁడు కాఁడు. అత డాజన్మయోధుఁడు. జీవితముతోఁ బ్రతిరంగ మాతని కొక యుద్ధము. ప్రతియుద్ధమునను విజయమొందు నప్రతిహతమయిన యాత్మవిశ్వాసముగల యోధుఁ డాతఁడు.

ఈ సందిగ్ధావస్థలో డాక్టరు స్థితి యిది. శాస్త్రవిద్యాప్రచారము నొనరించుట కాతఁడు దేశమున ప్రప్రథమ వ్యక్తి. బంజరునేలల సాగుచేసి నిరంతరకృషిచే శాస్త్రబీజము నందుఁ జల్లుటకు సర్వప్రయత్నముల నాతఁ డొనర్చెను. ఈ సమయములో ప్రయోజనాత్మక శాస్త్రజ్ఞానవాదులు తలమాఱి విత్తులు చల్లుటకు శాస్త్ర సస్యములఁ గోసికొనుటకు నూహించి, యాందోళనము చేయసాగిరి. వారట్టిప్రయత్నమునకుఁబూనుకొనినప్పుడుసర్కారుతో సంప్రదించియెటుం

గరు. సంప్రదింపమానిన మానిరి కాని యాకాలమున శాస్త్రి జ్ఞానపీఠమయిన డా. సర్కారును జమసమావేశములకు వారాహ్వానింపనైనలేదు. బహుశః రహస్యసమాలోచనములఁ గావించి డా. సర్కారు కృషి ఫలితముబు వారు దొంగిలింపఁదలపోసిరి కాఁబోలు! ఇంతగా బనిచేసిన వారు వారిసంఘోద్దేశములను బ్రచురింపనైనఁ బ్రచురించియుండలేదు. ఊరకే ప్రయోగాత్మకశాస్త్రి బోధన మను మాటను మాత్రము వారు పదేపదే యనుపల్లవిగా నుచ్చరింప మొదలు పెట్టిరి. ఇట్టి బాధ్యతారహితులు నవిమృశ్యకారులు నగువారికిఁ జేదోడయి వ్యవహరించుటకు డా. సర్కారేల యంగీకరించును! రెండు సమాజముల పక్షమున జరిగినసమావేశములో సర్ రిచర్డు టెంపులు డా. సర్కారు నాహ్వానించి తన పరిస్థితిని వివరింపుమని కోరెను. అప్పుడు సర్కారు "విద్యార్థులు శాస్త్ర విషయములలోఁ బాఠములు నేర్చుకొను కళాశాల స్థాపించుట నాయభిప్రాయము కాదు. మఱి విద్యార్థులు శాస్త్ర పాఠములఁ బ్రవీణతను గణించిన వెనుక వారిజీవితకాలమంతయు, లేదా వారి కిష్టమున్నంతకాలము శాస్త్రిశాఖలలో నేదో యొకదానియందు పరిశోధనచేయుటకు వీలయిన యవకాశములను గల్పించుటయు, నూతన పరిశోధనలకుఁ దావొసంగు స్వతంత్రపరిశోధనలు జరుపుటకు సౌకర్యముల నొసంగుటయు నాయుద్దేశములు. పాఠశాలా విద్యార్థులు ప్రత్యేక పరిశోధకుల స్థితి కొకేమారుగా రాలేరు. వైజ్ఞానికసమాజపు ముఖ్యోద్దేశము శాస్త్రాధ్యాపనము, శాస్త్రాధ్యయనమును నైయున్నది. ఈ ప్రణాళికలోఁ జిరు గృహపరిశ్రమలకు స్థాన

మొసంగలేము. క్రొత్తసంఘమువారూహించినట్లు శాస్త్రపఠనముయొక్క ముఖ్యోద్దేశము పరిశ్రమలకొఱకుఁ గాదు, దానియొక్క ప్రయోజనమంతకంటె నత్యుత్తమమును, నుదారతరమును నైయున్నది. హస్తపరిశ్రమలను, యాంత్రిక పరిశ్రమలను వృద్ధిపఱచు కళలలో విద్యార్థులకు శిక్షణనొసంగుట యీ సంఘముయొక్క యభిప్రాయము కాదు." అని పరపక్షముతోడి సమ్మేళనము పొసంగదని రూఢిపరచుచు నుపన్యసించెను.

డా. సర్కారు తన యుపన్యాసాంతమున "వ్యర్థములయిన యూహాపోహలతోఁ గాలము వృథాచేయనేల? కాలమనంతము. భూమి విశాలమయినది. మన యిరువుర సంఘములకే కాదు. ఇట్టి వానికి పెక్కింటికి కిందు స్థానము కలదు. వీరు వీరి యుద్దేశముల సాధించుటకుఁ బ్రయత్నింపుఁడు. మేము మాయుద్దేశముల కొనసాగించుటకుఁ బ్రయత్నించెదము. అందుచే మనలో మనకు స్పర్ధనశించి శాంతిప్రబలు" నని బోధించెను. ఈ వివాదమువలన డా. సర్కారు శీలమునందలి యచంచలాత్మక విశ్వాసము సుప్రకటితమైనది. ఈయచంచలాత్మ విశ్వాసమే యాతని జీవితగ్రంథమున బ్రతిపుటయందును గోచరించుచుండును. "రాజీ" మార్గము వ్యక్తియొక్క ప్రత్యేకతను నాశనముచేయును. ప్రత్యేకతాశూన్యమైన వ్యక్తిత్వము నీరసము. 'హిందూ సంఘము' చావలేక యెట్లో ప్రత్యేకముగాఁ బదియేండ్లు తనజీవితమును గష్టయుతముగా సాగించినది. తుదకు తానన్నట్టి దొక్కిందుకూడ నొనరింపఁ జాలకయే రూపడఁచినది. సర్కారు వైజ్ఞానికసమా

జము తన వినయాత్మకమయిన యుద్దేశములతోఁ గ్రమక్రమాభివృద్ధినొంది దేశమున ననన్యతుల్యమైన ప్రభావవంతమయిన శాస్త్రపరిశోధనాలయముగా మాఱినది. ఈ వైజ్ఞానిక సమాజమును గూర్చి సర్ సి. వి. రామను "ఇందుండి శాస్త్రశాఖలలోని ప్రత్యంశమునందును విజ్ఞాన ప్రవాహములు ప్రపంచమున కెల్లయెడల పాఱినవి. శాస్త్రవిజ్ఞానమభ్యసింపఁబడు ప్రతిదేశమునందును ఈ డా. సర్కారు వైజ్ఞానికసమాజము పేరొందె" నని ప్రశంసించెను.

## V
## గౌరవోన్నతులు

డా. సర్కారు నిరంతరకృషి ప్రజాదరమును, లోకప్రతిష్ఠను నాతనికి సంపాదింపక పోలేదు. మొదట ననిష్టమును సూచించినను చివరకు ప్రభుత్వమువా రాతని ప్రయత్నము నామోదింపక తప్పినదికాదు. దేశమున శాస్త్ర విద్యాప్రచారకుఁడను ఏకైక ప్రతిష్ఠ సర్కారునకుఁ గలిగినది. లార్డు కర్జను ప్రభువు "డాక్టరు ఆఫ్‌లా" అను గౌరవ బిరుదము నొసంగి డాక్టరు సర్కారును గౌరవించి యాతని కృషిని బ్రశంసించెను. తరువాత హోమ్యోపతీ వైద్యమున సర్కారద్వితీయుఁడాయెను. కష్టసాధ్యములగురోగములనిర్మూలమునకు, నౌదార్యమునకు, నార్తజనరక్షణమునకును కలకత్తాలోని ప్రజలందఱకును నాతఁడుశరణ్యుఁడయ్యెను. ఆతఁడు గౌరవ న్యాయాధిపతిగానై కొలఁది సంవత్సరముల తరువాత సి. ఐ. ఇ బిరుదము నొందెను. డాక్టరు శ్రద్ధాపూర్వక

మయిన కృషి, రాష్ట్రముయొక్క వివిధావశ్యకములతోడి పరిచయము ప్రభుత్వము గ్రహించి వంగరాష్ట్రశాసనసభా సభ్యత్వ మాతని కొసంగి తన్నుదా గౌరవించుకొనెను. కలకత్తా విశ్వకళా పరిషత్కార్య నిర్వాహసంఘ సభ్యుఁడుగను, కళాసంఘాధ్యక్షుఁడుగను నెన్నుకొనంబడి తత్పరిషత్పరిపాలనమున సర్కారుత్సాహమును జూపెను. 'ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్' ఆతనిని సభ్యునిగాఁ జేర్చుకొని గర్వించెను. హిందూవస్తు ప్రదర్శనశాల కతఁడు ధర్మకర్తగానుండెను. ఆతఁడు జన్మాంతమువఱకు శాస్త్రాభివృద్ధికై యేర్పఱుపఁబడిన బ్రిటిషు శాస్త్ర సంఘమున శాశ్వత సభ్యుఁడయ్యెను. ఏదో విధముగ ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ప్రతివిజ్ఞాన సంఘమునను నాతఁడు సభ్యుఁడాయెను. ప్రపంచమున నభివృద్ధ్యున్ముఖమైన ప్రతిసంస్థనుండి గుణపాఠముల నాతఁడు గ్రహించి వానిని తన దేశీయులకు ప్రసాదించెను. రాజా పియరీ మోహన ముఖర్జీగారనినట్లు డా.సర్కారు తన చిఱుతనాటి యాశాశాల నన్నిటిని సాక్షాత్కరింపఁజేసికొనిన గొప్ప ధన్యమానవుఁడనుటలో సంశయము లేదు. ఆతఁ డుదయించిననాఁడు హిందూదేశము పాశ్చాత్య దేశీయుల శాస్త్రపరిశోధనల నాశ్చర్యపడి చూచుచుండెను. ఆతని మరణకాలమున హిందూదేశము ప్రపంచమందలి యున్ని వృద్ధ్యున్ముఖసంఘములయందును బాల్గొని డాక్టరు స్వప్నములను యథార్థములుగావించెను.

అవసానకాలము:

డాక్టరు సర్కారు జీవిత మపరభాగమును బ్రవేశించెను. అతని నిరంతరకృషి, యధికోత్సాహము, కార్యదీక్ష గమనించినవారికి డాక్టరు చాలకాలము జీవింపఁడని తెలియవచ్చెను. జీవితావసాన చిహ్నలాతని ముఖమునఁ బ్రత్యక్షములు కాఁజొచ్చెను. అతఁడు గంభీరస్వరము గలిగిన వాఁడయినను దీర్ఘోపన్యాస సమయముల నాతని యూపిరితిత్తులు శ్రమను భరింపలేని లక్షణములఁ జూపింపసాఁగెను. అతని ముఖారవిందమున దేవతాంశ గోచరింపసాగెను. 1891 సంవత్సరమున 'ఇన్ఫ్లుయంజా' జ్వర మాతనికి వచ్చెను. తరువాత మలేరియాజ్వరము ఉబ్బసముతోగూడి యాతనిని బాధింప మొదలిడెను. అయినను మలేరియా రోగుల కతడొనర్చిన సేవ యనల్పమైనది. అంటువ్యాధియగు మలేరియా యన్న నాతనికి భయమే మైనను మలేరియా రోగుల యార్తనాదములా భయమును సడలించివైచినవి. హుగ్లీలో నొక పేదవానియింట మలేరియారోగి కీతఁడు చికిత్స యొసంగుటకు దినదినము తొమ్మిదిరోజు లరిగెను. సాధారణముగా నిలువెడలి దూరపుదేశముల కరిగిన డాక్టరు నూఱు రూప్యముల రుసుము గ్రహించెడివాఁడు. ఈ సమయమున మాత్రము కానీ పుచ్చుకొనలేదు సరిగదా మలేరియాతో నింటికి వచ్చి పడెను. తరువాత నీజ్వరము మూఁడేండ్లాతనిని పీల్చి పిప్పిచేసినది. ఆతని కాహారము జీర్ణమగుట తగ్గెను. అందుచే భోజనము చాల నతఁడు తగ్గించవలసి వచ్చెను. 1896 వ సంవత్సరమున ఫిరోజిపాయువరాజునకు వైద్యము చేయవలెనని

యాతని కాహ్వానము వచ్చెను. ఆతని కా వైద్యము చేయఁ బూనుట కిష్టమే లేదు. కాని యాతని స్నేహితుల బలవంతమున నాతని కయ్యది చేయక తప్పినది కాదు. అనిష్టుఁడైన భిషగ్వరుని వారు బల్లీ గంజీకి తీసుకొని పోయిరి. ఆ ప్రదేశమంతయు భయంకరమగు మలేరియా వ్యాధితో మూల్గురోగులతోఁ బ్రతిధ్వనించుచుండెను. తిరిగి డాక్టరునకు మలేరియా యంటుకొనెను. ఈ రోగమునుండి యాతఁడు మరల తెప్పిరిల్లలేదు. ఆ రోగము దీర్ఘరోగమయ్యెను. తరువాత నెన్నఁడును నాతనికి సంపూర్ణారోగ్యము కలుగలేదు. అయినను దినముల తరబడి, వత్సరముల తరబడి శాస్త్రమునకు సంబంధించిన యుపన్యాసముల నాతఁ డీయ మానినది లేదు. ఆతని యంతిమ కాలోపన్యాసములు కూడ సమగ్ర శాస్త్రపరిచయమున నేమాత్రమును గొంతంత పడలేదు. ప్రత్యుపన్యాస ప్రారంభమునను దుగ్గ్మతవలని యశక్తిని వెల్లడించుటయుఁ, బ్రారంభించిన వెనుక తన్మయుఁడై డాక్టరు వచించుటయును వినువారికి సుపరిచితములయినవి. ఒకదినమున 4 గంటలకు సాయంకాలమున డాక్టరు వైజ్ఞానిక సమాజమున విద్యార్థుల కుపన్యాస మీయవలసియుండెను. సుమారు మూఁడు గంటల కొకరు వచ్చి యొకరోగి చికిత్సావిషయమున రెండువందల రూప్యము లిచ్చెదమని బ్రతిమాలుకొనిరి. ఆ రోగిని దర్శించుటకు మంకోసంగుటకు రెండుగంటలకు తక్కువ కాలము పట్టదని యాతఁడెఱింగి, తనకై నిరీక్షించు

విద్యార్థులను భగ్నాశులనుజేయుట కిష్టపడక తిరస్కరించి పంపివేసెను. శాస్త్రప్రచారమున సుంతయైన నాటంకమును గల్గింపరాదు; అదియే యనర్ఘమయిన జీవితసిద్ధియని యాతఁడు తలపోసి యావజ్జన్మ మట్లు వ్యవహరింపఁగలిగెను.

రోగ మాతనిఁ గ్రమక్రమముగాఁ దినివేయుచుండెను. ఆతఁడు కృశీభూతశరీరుఁడయ్యెను. 1903 నాఁటి కితనికి డెబ్బదియేండ్లు నిండెను. అతని ప్రియపుత్త్రిఁడు డాక్టరు యొక్క సప్తతితమ జన్మదినోత్సవమును గావించెను. అప్పటికే డాక్టరు తాను డెబ్బదియొకటవ సంవత్సరము చూడనని యెఱుంగును. అతని హృదయమున శాంతి వసించెను. ఆతఁడు తన విజ్ఞానమును నిద్రావస్థలో నుంచ లేదు. భగవంతుని యనల్పములగు వరప్రదానముల వివరించుటకై తన బుద్ధి వికాసము నాతఁ డుపయోగించెను. ప్రపంచము విజ్ఞాన పూరితుఁడైన యొకవ్యక్తిని గోల్పోయి విచారాంధకారమున మునుంగవలసిన సమయ మరుదెంచెను. బంధువులను, హితులను సర్కారు చేరఁ బిల్చి "భగవంతుని యందును, మతమునందును విశ్వాసము గలిగియుండుఁడు" అని వచించెను. శాస్త్రజ్ఞుఁ డిట్లు చెప్పుటాశ్చర్యజనకమే. ఆతని యభిప్రాయములో భగవంతుని మతము మానవుని హృదయమునం దుండును. ఆతఁడెప్పుడును భగవంతునియందు విశ్వాసమును గోల్పోయి యుండలేదు. అతనికి మతాచర

ణము కావలయును కాని ఆడంబర మవసరము లేదు. సర్కా రంత్యదినములు బాధాకరములుగానే యుండెను. ఆబాల ప్రవృద్ధమయిన కార్యదీక్షచే దనమనస్సును భగవంతుని యందును, నతని సృష్టిపరిశీలనమునందును నాతడు నియోగించెడివాఁడు. తనబాధల నన్నింటిని వీరునివలె నతఁడు భరించెను. ప్రతివ్యక్తియు ప్రతిక్షణము తనజీవితమునకుఁ గారణభూతుఁడయిన భగవంతునికిఁ గృతజ్ఞుఁడై యుండవలయునని యాతని జీవిత సందేశము. భిషగ్వరుఁడు పరమపదించెను. వైజ్ఞానిక ప్రపంచ మంధకార బంధురమయ్యెను.

# సర్ జగదీశచంద్రబోసు

## 1. జననము:-

1. అసామాన్యమైన విజ్ఞాన శాస్త్రపాండితిచేఁ దిగంత విశ్రాంత కీర్తి నందిన జగదీశచంద్రబోసు క్రీ. శ. 1850 వ సంవత్సరము నవంబరు ముప్పదవ తేదీని దక్కనులోని విక్రమపురమునందుఁ బ్రతిష్ఠకెక్కిన వంశమున నుద్భవించెను. చిఱుతప్రాయమునుండియు జగదీశబోసు వస్తు నిర్మాణములన్నను, బరిశోధనలన్నను నెక్కుడు ప్రీతి చూపుచుండెడివాఁడు. ఈగుణమునకతని స్వీయప్రతిభ యెంత కారణమో, యాతని పితృపాదుఁడగు భగవాన్ చంద్ర బోసుయొక్క ప్రోత్సాహము కూడ నంతే కారణము. కుమారుని సహజ ప్రతిభను గ్రహించి యాతఁ డది పెంపొందుటకుఁ దగిన యవకాశములఁ గల్పించెను. ఫారిద్ పురమున డిప్యూటీకలెక్టరుద్యోగమున నున్న యాతని కేది కొఱత ? భగవాన్ చంద్రుఁడును నుత్తమశీలమును, నుత్పాదన ప్రతిభా సామర్థ్యమును గలిగిన ధీరమనీషి. ఆతనినిఁగూర్చి జగదీశుఁడు "నాతండ్రి కార్మిక విద్యాలయములను, వృత్తి విద్యాశాలలను స్థాపించెను. వాని నుండియే యాకాలమున సృజనాభ్యాసము నామనస్సున కలవడినది. భగవంతు నొక కార్మికునిగా నెంచి కర్మకారులందఱును జేయు విశ్వకర్మా రాధన ప్రక్రియ నాహృదయమున సుస్థిరమయిన సంస్కార మును గలిగించినది. ఆ విశ్వకర్మ చేతయే యీ యనంత విశ్వమును బోఁతపోసినది. ఏదియో నూతనసృష్టికి నుద్దేశింపఁ

బడిన మనమందరమును నాతనిచేతిలోని కీలుబొమ్మలమే యని నేను భావించెద" నని యాతం డొక సమయమునం జెప్పి యుండెను. భగవత్సృష్టిలో హితములయ్యు దుర్గ్రాహము లగు సత్యములు పరిశోధింపవలయునను నుత్సాహము గల వారి కీ విశ్వకర్మారాధన సమంజసము కాదనంగలమా ?

2. విద్యాభ్యాసము:

అప్పుడే యాంగ్లవిద్యాశాలలు దేశమునందుం దల లెత్తుచుండెను. చాలమంది వానియెడ నాదరమును జూపు చుండిరి. కాని భగవాను చంద్రబోసున కా పాఠశాలల విద్యావిధానమునెడ నాదరము కలుగలేదు. పలువు రాపాఠ శాలకే తనకుమారునిం బంపుమని ప్రోత్సహించినను నా యా లోచనాపరుం డంగీకరింపక జగదీశ్వరుని గ్రామపాఠశాలకే పంపెను. ఆపాఠశాలలోని విద్యార్థులు ధనవంతుల ముద్దు బిడ్డలుగారు. కష్టపడి పనిచేయు కార్మికులయొక్కయు, శ్రామి కుల యొక్కయు మోటుతేరిన పిల్లలు. వారితోడి సహాధ్య యనము జగదీశ్వరునకు హీనముగం దోంచలేదు. జాలరి వాండ్రపిల్లలు చెప్పు కథలను, గభీరోదధులయందలి వింత మృగముల యొక్కయు, చేంపలయొక్కయు వృత్తాంతము లను విని యాతండు తన్మయుం డయ్యెడివాండు. కర్షక జీవి తము, పంటలు, కోంతలు మున్నగువానిం గూర్చి తోడి వారు తనకుం గథలుగాం జెప్పుచుండ సామాన్య మానవ జీవనముతో సానుభూతి గలుగుటయేకాక యాతనికి ప్రకృతి యున్న నాదరము, గౌరవము జనించినవి. పూర్వాచార పరాయణురాలయినను జగదీశ్వరుని తల్లి, బడిపిల్లలతోం

గలిసి యింటికరుదెంచు పిల్లవానిని జూచి యానందించి, తన బిడ్డతోఁగూడ వారలకందఱకును నల్పాహారముల నొసంగెడిది.

## 3. జగదీశ చంద్రబోసు ప్రాథమిక విద్యాభ్యాసము :

ఇది సంప్రదాయ సిద్ధమయిన గ్రామపాఠశాలలో జరిగెను. కాని మాతృభాషా బోధనము జరుగు పాఠశాల లోనికిఁ దమ బిడ్డలను బంపుట యా రోజులలో నాచారము కాని, నాగరికత కాని కాకుండెను. పెద్దవాఁడయిన వెనుకఁ దన పాఠశాలాధ్యయనమునుగూర్చి బోసు "నా పితృపాదులు నన్ను గ్రామ పాఠశాలకుఁ బంపుటలోని యుద్దేశము నాకిప్పుడు బోధపడినది. జీవితాదర్శము లేర్పడుదినములలో మన దేశీయ సంప్రదాయములనుగూర్చి, విజ్ఞానమునుగూర్చి మాతృభాషలో నధ్యయనము సలుపు నవకాశము లభించినది. భావమునకును భాషకును నవినాభావసంబంధము కలదు. భాషారూపమున జాతీయ భావము పెంపొందుటకును, జాత్యభిమానము వృద్ధియగుటకును నవకాశములు కలవు. అదియును గ్రామపాఠశాలయగుట సామాన్య బాలురతో నెట్టి విరుద్ధ భావములుగాని, గురుత్వ నైచ్యభావములుగాని లేకయుండుటకు వీలయినది. గ్రామ బాలురతోడను, పల్లీవిద్యార్థుల తోడను సాంగత్యము నాయాధిక్యభావము నణచి సమత్వబుద్ధి నెలకొల్పిన"దని గౌరవపురస్సరముగా వచించెను. ఉత్తమాదర్శముగల వా రిట్లు సమత్వబుద్ధి నొందక వేఱొక భావము నెట్లు పొందుదురు! అయినను భగవాన్ చంద్రుఁ

డాచరించినది సమకాలీనభావమునకు విరుద్ధమయినదే. ఇంతకు మించినది వేఱొండు కూడ నాతఁడొనర్చెను. తన కుమారు నొక దోపిడిగాని స్వాధీనమున నుంచి బడికి పంపుచుండెడివాఁడు. ఆ దోపిడిగాని చరిత్ర విచిత్రమయినది. భగవానుని ప్రకృతియు నంతకంటె విచిత్రమైనది. భగవాన్ చంద్రబాబు ఫారిద్‌పూరులో సబుకలెక్టరుగా నున్నప్పుడొక దొంగలగుంపు ఆ జిల్లాలోఁబడి దోచుకొనుచు బీభత్సమును గలిగించుచుండెను. ఆదోపిడి గాండ్ర ముఠా కీతఁడొక నాయకుఁడు. భగవాన్ చంద్రబాబు ముఠానాయకుల నందఱిని బట్టుకొని కఠినముగఁ గారాగారశిక్ష విధించెను. కారాగారవాసానంతర మీ దోపిడిగాఁడు భగవాన్ చంద్రబాబు కడ కరుదెంచి నమస్కరించి తన కేదైన భృతి గల్పించుఁడని కోరెను. ఆతనిని గసరిపొమ్మన నాతనికి మనస్సొప్పలేదు. అయిన నాతని మనస్సులో నెట్టి భావప్రబోధము కలిగెనో, తన నాలుగేండ్ల కుమారుఁడగు జగదీశుని బడికిఁ దీసికొనిపోవుట కాతనినిఁ దనయొద్దనే సేవకునిగా నియమించికొనెను. బడి యింటికి కొంచెము దూరముగానే యుండెను. ఈ దోపిడిగాఁ డేమి చేయునో యని పలువు రనుకొనిరి కాని యాతఁడు మాత్రము జగదీశుని నొడలిపై నీగనైన వ్రాలనీయక పాత్రిళ్లలోఁ బట్టుకొని యా యా కథ లుత్సాహపూర్వకముగా నాతనికిఁ జెప్పుచు నతిజాగరూకతతో నతని వెన్నంటి యుండెడివాఁడు. ఒక్కొక్కప్పుడు చిఱుతవాఁడయిన జగదీశునకుఁ దన పూర్వ జీవిత చర్యలలోని సాహసకార్యములను, దా నప్పుడప్పుడు ప్రాణాపాయములనుండి సమయ

స్ఫూర్తితోఁ దప్పించుకొనిన విధమును జెప్పుచుండెడివాఁడు. అంతటి దురాచారపరుఁ డెంతలో సుగుణుఁడయ్యెనో యూహింప బాలునకుఁ జిత్రముగ నుండెడిది. అది మొదల లాతఁడు బోసుసంసారము నెడ సంపూర్ణ భక్తివిశ్వాసములతో మెలఁగుచుండెడివాఁడు. భగవాన్ చంద్రుఁ డాతని కొనర్చిన మహోపకృతికి దోపిడిగాఁడు ప్రత్యుపకారము చేయకపోలేదు. ఒకదినమునఁ బడవలో భగవాన్‌దాసు భార్యాసుతులతోఁ బ్రయాణము చేయుచుండ కొందఱు పడవదొంగలు వారి పడవదగ్గఱకు వచ్చి యుపద్రవము కల్పింప నుద్యుక్తులైరి. ఆ సమయమున నా దోపిడిగాఁడు వారి భావము నెఱింగి నిలుచుండి యొక యీలవైచెను. ఆ యీల సంజ్ఞ యేమో కాని, మీఁదఁబడనున్నవారందఱును దూరముగాఁ బడవ నడపుకొనిపోయిరి. భగవంతుఁ డెవ్వరితో సాంగత్యము నొందుల కొనర్చునో తెలిసికొనుట దుర్లభము కదా!

భగవాన్‌చంద్రుఁడు జగదీశుని విద్యావిషయమున నధిక శ్రద్ధవహించెను. కలకత్తా నగరములోని సెంట్‌జేవియరు కళాశాలలోఁ జదివి బోసు పట్టభద్రుఁ డయ్యెను. బోసున కింగ్లండున కరిగి 'ఇండియన్ సివిలు సర్వీసు' అనఁగా ఐ. సి. యస్. పరీక్షకుఁ జదువవలయునని కుతూహలముగానుండెను. కాని యాతని తండ్రి కది మాత్ర మిష్టము లేకుండెను. ఆతఁడొక సమర్థుఁడైన మండలపాలకుఁడే యయినను దన కుమారుఁడుకూడ నట్టివాఁడే యగుట యాతని కిష్టములేదు. బహుశః కుమారుని భావిజీవిత ప్రభావము నాతఁడు దూరదృష్టి నెఱింగెనో యేమో! తనకుమారుఁడు

విశుద్ధకీర్తి శాకరమయిన పాండిత్యము గడింప నధ్యయనము చేయవలయునని యాతఁ డభిలషించుచుండెను.

బోసు ఇంగ్లండున కరుగ నెంచినప్పుడును ఐ. సి. యస్. పరీక్షయనిన నాతని తండ్రి కనిష్టముగానే యుండెను. శాస్త్రప్రవక్త కాఁదలఁచినవాని జీవితమార్గము వేఱొక పద్ధతి నేల యవలంబించును?

జగదీశుఁ డింగ్లండున కరిగెను. ఆతని బి. యే. పట్టము మెట్రిక్యులేషనుపాటి యయ్యెను. వైద్యకళాశాలలోఁ బ్రథమ సంవత్సర విద్యార్థిగా నాతఁడు చేరెను. వైద్య విద్యార్థి తరగతులలో బోధించు పదార్థ రసాయనశాస్త్రము లందు బోసునకు మంచి ప్రావీణ్యమేయుండెను. కాని జంతు శాస్త్రమునందుఁ బరిచయము లేకుండెను. అయినను గార్య దీక్షతో నాతఁడు చదువఁ బ్రారంభించెను. కాని జంతువులఁ జంపి యవయవవిభాగ మొనర్చి పరిశీలించుపట్ల నా శస్త్రా గారమునుండి వెలువడు వాసనలకుఁ దలఁచుగ బోసునకు జ్వరము వచ్చుచుండెను. ప్రసిద్ధుఁడైన వైద్యుఁ డాతని వ్యాధికిఁ జికిత్స చేయుచు వైద్యకశాస్త్రి త్వ మాతనికి సరిపడ దని బోధించెను. తలఁచుగ శరీరారోగ్యమునకు భంగము కలుగుచుండఁ జేయునది లేక కేంబ్రిడ్జి కరిగి యచ్చట శాస్త్ర విద్యార్థిగాఁ జేరి చదువవలయునని బోసు తలపోసెను. ఆతడు ప్రకృతి శాస్త్రశాఖలోఁ జేరి క్రీ. శ. 1884 వ సంవత్సర మున క్రీస్తుకళాశాలలో బి. ఏ. పట్టభద్రుఁడైె విద్యార్థి చేతనమును బహూకృతిగఁ బడసెను. మఱుసటి సంవత్సరము

లండను విశ్వకళాపరిషత్తులో బి. యస్. సి. పట్టమునొంది మాతృదేశమునకు మఱలెను.

## II

### శాస్త్రకృషి

పాశ్చాత్యదేశమునుండి తిరిగివచ్చిన బోసు ఆచార్యత్వమును వహించునని యెవ్వరనుకొనిరి? విధివైదములు విచిత్రములు. అప్పటికి బోసువయ స్సిరువదియైదు సంవత్సరములు. హిందూదేశమునకు రాజప్రతినిధిగానున్న రిప్పను ప్రభువున కొక పరిచయలేఖను పాశ్చాత్యదేశమునందలి ప్రొఫెసరు ఫాసెట్టు నుండి బోసు తీసికొనివచ్చెను. ప్రాథమికములైన కొన్ని యిబ్బందులవలన నాటంకము గలిగినను నెట్లో తుదకు బోసునకు రాజధాని కళాశాలలో భౌతికశాస్త్రిశాఖయం దాచార్యత్వము లభించెను. అంతియకాని శాస్త్రితృష్ణ తీరని బోసునకుఁ బ్రయోగసాధనములతోడి ప్రయోగశాల లేకుండెను. అందుచే నాతనికిఁ బరిశోధన గావించుటకు వీలులేకపోయెను. ఈ యసంతృప్తికిఁ దోడు వేఱొక మనోవేదన యతనిని బాధింపఁజొచ్చెను. ఆంగ్ల విద్వాంసులతోడి సమాన ప్రతిపత్తి నొసఁగకుండ భారతీయ విద్వాంసులను ప్రభుత్వమువా రీసడించుచుండిరి. పాశ్చాత్యులకంటె విద్వత్తె యధికముగఁ గలిగియున్నను నీన్యూవత యేమియని యాతని హృదయమున ప్రతినిమేషము తీరని బాధ కలుగుచుండెను. మొదట నాంగ్లాచార్యుని జీతములో భారతీయునకు మూఁడవ వంతుండెను. ఈతఁడు వచ్చి యుద్యోగస్వీకరణము చేయుసరికి దానిలో రెండువంతులు

మెులం దగ్గింపఁబడెను. తేజస్వి కిది తీరని హృదయ శల్య మగుటలో సందేహ మేమి? ఇతరులవలె బోసు నిర్వీర్యుఁడును, కార్యదీక్షాహీనుఁడును గాదు. ఆత్మగౌరవము నండఁ జేసికొని యితఃపూర్వ మెవ్వరెఱుంగని తీవ్రప్రతిఘటన మొండాతఁడు సాగింప మొదలిడెను. తన ప్రతిఘటన నిరాదరింపబడుటచే నాతఁడు వేతనము స్వీకరింప నిచ్ఛగింపలేదు. మూఁడేం డ్లొక్క కాని యెఱుంగకుండఁ బ్రతిఘటించుచునే తీవ్రకృషి సల్పుచుఁ దన యాత్మగౌరవమునకు హాని ఘటింపకుండఁ గాపాడుకొనెను. ధనాభావముచే బోసు దంపతు లెట్టి బాధనొందిరో యాతనిభార్యకే యెఱుక. అయిన నా పరమసాధ్వి భర్తృప్రతిఘటనను దిరస్కరించినదికాదు. ఆమె ధైర్యోత్సాహములే బోసును విజయవంతునిఁ జేసినవి. మూఁడవసంవత్సరము చివరఁ గళాశాలాధ్యక్షులును, విద్యాశాఖాధికారులును బోసుశాస్త్రకృషియొక్క ఘనతను గుర్తెరింగిరి. ఆతని ప్రయోగశాలను సందర్శించిరి. ప్రభుత్వమువా రొనర్చిన యన్యాయమునకు నొచ్చుకొనిరి. వెంటనే బోసు నుద్యోగమును శాశ్వతము చేయుటయేకాక, మూఁడేండ్ల జీతమును ప్రాఁతబాకీతో సంపూర్ణముగ నొకేసారి చెల్లించిరి. సత్యాగ్రహము విఫలీకరింపఁ బడిన దెన్నఁడును లేదు. ఆత్మగౌరవహాని ప్రాణనష్టముకంటె నధికతరమయినదని భావించు కార్యదీక్షాధురంధరులు సాధింపలేని కార్యములు లేవు.

బోసు రాజధానీ కళాశాలకు వచ్చుసరికి ప్రయోగశాలయే లేదు. బో సేదియో యొక ప్రత్యేకమయిన ప్రయోగ

శాలలోఁ గృషిసలుపవలసివచ్చెను. అయిన నతనికి నిరుత్సాహము కలుగలేదు. క్షమాశక్తి తరుగలేదు. కార్యదీక్ష సడలలేదు. తరువాత నెప్పుడో పదివేండ్ల కాలని కొక ప్రయోగశాల యొసంగఁబడెను. అయ్యది రూపాంతరము చెందిన వరప్రసాదము.

ఉండియు లేకుండిన ప్రయోగశాలలో నేమి పరిశోధనము జరుగఁగలదని నిరుత్సాహముఁ జెందక బోసు నిరంతరమును శాస్త్రచింతనమునందే కాలము పుచ్చుచుండెను. "పోలరైజేషన్ ఆఫ్ ఎలెక్ట్రిక్ రే బై ఎక్రిష్టల్" అను విషయముపై బోసు 1895 లో బెంగాలులోని ఏషియాటిక్ సొసైటీవారి పత్రికలో నొక వ్యాసమును వ్రాసి ప్రచురించెను. తరువాత 'ఎలెక్ట్రిక్' అను పత్రికకుఁ గొన్ని వ్యాసములు వ్రాసి పంపెను. ఈవ్యాసములతో బోసుజీవితమున నొక విచిత్ర పరిణామము సంఘటిల్లినది. రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారు బోసు పరిశోధనల నసర్ఘములయిన వానినిగా గ్రహించి శ్లాఘింపఁ దొడఁగిరి. అసలు రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి పత్రికలో వ్యాసములు ప్రకటింపఁబడుటయే యొక గొప్ప. అందును శాస్త్రజ్ఞ లోహహో యన్న నాతని ఘనతఁ గూర్చి చెప్పనవసరము లేదు. ఇదికాక బోసు వ్యాసములకు పార్లమెంటునకు సంబంధించిన విరాళమునుండి కొంత పారితోషికము సమర్పింపఁ బడుట ప్రశంసింపఁదగిన దేకాక భారతీయు లెల్లరును గర్వింపఁదగినది. తరువాత రెండుసంవత్సరములకు ఏషియాటిక్ సొసైటీవారు బోసు పరిశోధనలను సాగించుటకుఁ గొంత విరాళము నొసంగఁ దలఁచిరి. అప్పుడు

బెంగాలు ప్రభుత్వమువారే బోసునకు పరిశోధనలకైన యోను కూల్యములను గల్పించిరి. రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారు విరాళము లిచ్చెదమని బోసున కుత్సాహము గలిగింప కున్నచోఁ దప్పక బెంగాలు ప్రభుత్వము వారా యుత్తమ శాస్త్రిజ్ఞ నుపేక్షించెడివారే. బోసు సహజముగా శాస్త్రి మునం డభిలాష కలిగిన శాస్త్రికర్తృకు. సహనశీలము, హృదయశాంతి యాతనికిఁ బెట్టని యలంకారములు. ప్రయత్న విజయాభిలాష కలిగినవాఁడే కాని యాతఁడు బహూకృతు లను బరమావధిగా నెంచినవాఁడు కాఁడు. 1895 లోఁ దన కమితోత్సాహ మొసంగి శాస్త్రి పరిశోధనకు దోహద మొనరించిన ఏషియాటిక్ సొసైటీ వారికి తన పరిశోధనలను బోసు పంపెను. ఆతని పరిశోధనల గమనించి వారు దిగ్భ్రమఁ జెందిరి. ఆ పరిశోధనల ప్రాధాన్యము వారెఱింగినవారగుట నాశ్చర్యనిమగ్నులై బోసు శాస్త్రిప్రావీణ్యము నుగ్గడించిరి. ఆ పరిశోధనలు లండను విశ్వవిద్యాపరిషత్తు వారిచే 'డాక్టరు' బిరుదమును బోసునకు సమర్పింపఁ జేసినవి. ఇయ్యది హృదయ తన్మయకారియగు మధురసంగీతమును విని కృతజ్ఞతకు 'ఓహో' యని తలయూఁచినంత మాత్రమ. ఆతని యెడ పరిగ లించి చూడ నిట్టి డాక్టరు బిరుదము లెన్నిఁటికిఁ దగిన విద్వత్తె యందు నిగూఢమై యున్నదో!

ఆసంవత్సరముననే బోసు శాస్త్రిదృష్టి వేఱొకవిధ ముగాఁ గూడఁ గృషి సలుప మొదలిడెను. అయ్యది తంత్రులు లేకుండఁగఁ దంతివార్తను బంపుటకైయునపరిశోధనము. ప్రపంచ

ములో నొకేకాలములో నానిస్త్రంతీ యోగమునుగూర్చి ముగ్గురు శాస్త్రజ్ఞులు కృషిసల్పుట చూడ విచిత్రముగునవిషయము. మొదటివాఁడు బొలొగ్నా పరిషత్తు విద్వాంసుఁడయిన మార్కోనీ; రెండవవాఁడొక యమెరికా శాస్త్రజ్ఞుఁడు. మూఁడవవాఁడు హిందూదేశీయుఁడయిన మనబోసు. సమకాలిక ప్రతిభ లవిదితముగా ప్రస్ఫురించుచుండుననుట కిదియొక ప్రబలనిదర్శనము. పై ముప్వురిలో మొదట ప్రయోగాత్మకముగ దీనిని సాధించినట్టివాఁడు బోసు. అతఁడు గవర్నరు సమక్షమున నిస్తంత్రీయోగమును ప్రదర్శించి చూపించెను. దూరపుఁగొండలు నునుపన్న సామెతయం దెంతయో సత్యమున్నది. మనవా రెంత మనీషావంతులయిన లోకము వారిని సత్కరించి ప్రోత్సహించక పోవుటయు, ప్రతిభను గుర్తింపనయిన గుర్తింపకపోవుటయు సరికదా, యితరులతోఁ బోల్చి న్యూనత నాపాదించుటకుఁ గూడ యత్నింతురు. ఇదియొచ్చటి వింత ప్రకృతియో బోధపడదు. బహువర్షాగతమైన పరప్రత్యయబుద్ధి లక్షణ మియ్యదియై యుండునా. అనిపించును. అయినను గాల ముపజ్ఞ నుపేక్షింపలేనిది. పాశ్చాత్యశాస్త్రజ్ఞ,

## III

## పరిషత్తులలో నుపన్యాసములు

జగద్విఖ్యాతినొందిన డేవీ ఫేరడీ శాస్త్రప్రయోగశాలలో నుపన్యాసము లొసంగు నవకాశము లభించుటయే దుర్లభము. లభించెఁబో దానితోఁ దుల్యమయిన గౌరవము మఱొండు లేదు. అట్టి యనన్య సాధారణమైన గౌరవము డాక్టరుబోసునకు నొండురెండుమారులు సంప్రాప్తమయినది.

నవ్యాతినవ్యములగు పరిశోధనలఁగూర్చి యుపన్యసింప నాశాస్త్రజ్ఞులచే మూఁడుపర్యాయములు బో సాహ్వానింపఁబడెను.

రాయల్ సొసైటీ సమక్షమున 1897 వ సంవత్సరములో బోసు విద్యుత్తరంగములఁగూర్చి యుపన్యసించెను. ఆ యుపన్యాసము మనోజ్ఞముగను, బండితానందకారిగను నుండెను. వృక్షములు, జంతువులు విద్యుత్ప్రవాహము వానిలోఁ బ్రసరింపఁజేసినఁ బ్రదర్శించు వికారములఁ గూర్చి యాతఁడు ప్రయోగము మూలమున నుపన్యసింప సర్ మైఖేల్ ఫాస్టరు అను ప్రఖ్యాతజంతుశాస్త్రజ్ఞుఁ డపరిమితానందభరితుఁడై కుప్పిగంతులువైచి, తానావిషయమును రాయల్ సొసైటీవారికిఁ దెలియపఱుచుట కంగీకరించెను. అప్పుడాతఁ డేతత్సంఘకార్యదర్శి. మఱల 1901 సంవత్సరము మే 10 వ తారీఖునఁ బూర్వపు శాస్త్రజ్ఞ పరిషత్సమక్షముననే బో సుపన్యసించెను. వృక్షములందును, మానవులందును సదృశములైన వికారములు గలుగుట యాతఁడు విస్తృతమైన ప్రయోగము మూలమునఁ బ్రదర్శించెను. ఈ యుపన్యాసము పండితుల పొగడ్తలకుఁ బాత్రమగుటయే కాక శాస్త్రజ్ఞమండలులలో నూతనభావములఁ గలిగించెను. వీనితోఁ గొన్ని చిక్కులుకూడ మెల్లగ నల్లుకొని రాఁదొడఁగినవి. ఎంతటిపండితులయిన నసూయకు, నసహిష్ణుభావమునకును గుఱికాక మానరనుట కిది యొక ప్రబలనిదర్శనము. జూను ఆఱవ తారీఖున బోసు రాయల్ సొసైటీవారిముందు తన విమర్శనాత్మకమయిన పరిశోధనను గూర్చి వ్యాసమును నివేదించెను. సర్వవివరణములతోడి ప్రయోగము ప్రదర్శింపఁబడెను.

వ్యాసపఠనమంతయు ముగిసినవెనుక సర్ జాన్ బర్డన్ సాండర్సన్ అను ప్రఖ్యాత జంతుశాస్త్రనిష్ణాత లేచి మొదట బోసుపరిశోధనలఁగూర్చి యుగ్గడించి, తరువాత వృక్షశాస్త్రిజ్ఞుఁడు తన పరిమితిని మించి జంతుశాస్త్రిమునకు నధిగమించుచున్నాఁడనియు, నాతఁడు చెప్పినది సత్యపమ్మాత్రము కానేరదనియు, "ఎలెక్ట్రిక్ రెస్పాన్సు" అను పేరు మార్చుటొప్పుగనుండుననియు నిర్దాక్షిణ్యముగ నుడివెను. ఆతని ప్రతిపాదనమును కొందఱు లేచి బలపఱిచిరి. "ఇంతటిదేనా యీశాస్త్రిపరిషద్వివేకజ్ఞానము! ఈ నావ్యాసమునందలి యొకపదము కాదుకదా, యొక పొల్లయినను దిద్దుటకు వీలు లేదు. నే నంగీకరింపనుగూడ. నావ్యాసమును ప్రకటింప నిరాకరించిన నిరాకరింతురుగాక. ప్రయోగమూలమున నా సత్యములు విశ్వాస్యములు కావని రుజువుచేయఁబడువఱకు వీని యాథార్థ్యమును గూర్చి నేను శంకింప" నని ధైర్యముతోడను, నాత్మవిశ్వాసముతోడను విను వారల గుండెలు ఝల్లు మన బోసు సాండర్సన్ ప్రముఖుల విమర్శనకుఁ బ్రతిసమాధాన మొసంగెను.

జాతిమతభేదములఁ బురస్కరించుకొని విరోధములు హిందూదేశముననే కలవని యితర దేశీయు లనుట వినుచుందుము. అంతకుమించిన వేఱొక దురాచార మా పాశ్చాత్యులయందుఁ గలదనుట కా పై నిదర్శనము చాలును. శాస్త్రిజ్ఞులు సత్యాన్వేషకులు, నిష్పక్షపాతబుద్ధులు నై యుండవలసియుండ, ద్వేషబుద్ధితో రాయల్ సొసైటీవారు బోసువ్యాసమును బ్రకటింపక తిరస్కరించి పంపివేసిరి.

బోసు హిందూదేశమునకుఁ దిరిగివచ్చెను. రాయల్ సొసైటీవారి తిరస్కరణ మాతని హృదయమునఁ దీరని శల్యమై యుండెను. బోసు తిరుగ నింగ్లండునకుఁ బోయి తన ప్రయోగములయొక్కయు, బరిశోధనలయొక్కయు సత్యములను సుప్రతిష్ఠితములు చేయుట కొఱకు సెలవుగైకొని పూర్వముకంటె ద్విగుణీకృతమయిన కార్యోత్సాహముతో నప్పటి 'సెక్రటరీ ఆఫ్‌స్టేటు' యొక్క ప్రోద్బలమున లండనుకరిగి ప్రయోగములనొనర్పసాగెను. పలువురు శాస్త్రజ్ఞులు, వృక్షజంతుశాస్త్ర నిష్ణాతులు వచ్చి యాతని ప్రయోగఫలితములను సందర్శించి యానందించిరి. ప్రొఫెసరు వైన్సు తనతో హారేస్‌బ్రౌను పండితునిఁ గైకొని బోసు ప్రయోగశాల కరుదెంచి యాతని పరిశోధనల ఫలితములను బ్రత్యక్షముగఁ జూచి సంతోషమునఁ బరవశుఁడై మెచ్చుకొని గంతులిడెను. ఇంత పరవశులై ప్రవర్తిల్లిన యాంగ్లేయుల నెన్నఁడును బోసు చూచియుండలేదు. 'బండారులు' తప్పటలుకొట్టికొనుచు హర్షప్రలాపముల నెన్నో చేసిరి. వారిరువురిలో నాసంవత్సరము రాయల్ సొసైటీకొక రధ్యక్షులును, మఱొకరు కార్యదర్శులు నగుటవలన, బోసును "నీవ్యాసమును మాసంఘమున నివేదింపుము. ప్రఖ్యాతశాస్త్రజ్ఞుల నెల్ల నాహ్వానించెదము. ఈసమయమున నీ ప్రతికక్షులు ప్రయోగముల దర్శించి యేమనఁగలరో చూత"మని ప్రోత్సహించిరి.

ఇంతలో వేఱొక యవాంతరము తటస్థించెను. బోసు వ్యాసములోని పరిశోధితసత్యములు నవ్యములు కావనియు,

నంతకుఁబూర్వమే వేఱొకనిచేఁ దెలిసికొనఁబడి ప్రకటింపఁబడినవనియు ప్రచారము ప్రారంభమయ్యెను. ప్రయాసయంతయు గంగపాలు కానున్నదని బోసునకుఁ బ్రథమమునఁ గలవరపాటు కలిగెను. కాని మధ్యస్థు లీ విషయమును గూర్చి సమాలోచనలను సల్పి, యీ యజ్ఞాతశాస్త్రజ్ఞుఁడు లండనునగరమున బోసునుపన్యాసమును విని వాదమునఁ బాల్గొనినవాఁడై తరువాత నీ యసత్య ప్రకటనమును గావించెనని నిర్ణయించిరి. నిజము నిలకడమీఁదఁ దేలు నన్నట్టిది సత్యమయ్యెను. మరల బోసు ఉపన్యాసమిచ్చుటకై యాహ్వానింపఁబడెను. అతని ఘనత లోక మెఱుఁగఁగల్గెను. ఒకటి తరువాత నొకటిగాఁ బాశ్చాత్యదేశమందలి యున్న పరిషత్తులును బోసు నాహ్వానించినవి. బోసు శాస్త్రజ్ఞ పరిషత్తునకు హిందూదేశ పక్షమునఁ బారిస్ నగరమున కరిగి యం దుపన్యసించెను. అతని మేధాసంపత్తికిని, శాస్త్ర ప్రావీణ్యమునకును, శాస్త్రపరిశోధనకును ఱిచ్చపాటునొంది పాశ్చాత్యు లాతని వేనోళ్లఁబొగడిరి. అచ్చటనుండి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకును, కేంబ్రిడ్జి పరిషత్తునకును నరిగి అమెరికాదేశమునకు రావలసినదని తంతివార్తపైఁ దంతి వార్తలు రాఁగా బో సచ్చటి కేగి యున్న విద్యాపరిషత్తుల లోను బహూకృతు లంది ప్రపంచవిజయయాత్రసలిపి హిందూదేశమునకుఁ దిరిగివచ్చెను. ఇచ్చట ప్రఖ్యాతసంస్థలు స్వాగతపత్రములు, సన్మానపత్రములు, అభివందనసమర్పణ పత్రములు వర్షముగాఁగురియించి యాతని యుపజ్ఞకుఁ దగిన గౌరవ మొసంగఁజాలకపోయితిమని విచారించెను. అతిపరిచ

యమువలన నవజ్ఞయన్నదియున్నను, కలకత్తా విశ్వవిద్యాలయ పరిషత్ప్రతమువారు బోసుశాస్త్రపరిశోధనకు 'డాక్టరు' బిరుదమునొసఁగి తమ్ముఁదాము గౌరవించుకొనిరి.

పాశ్చాత్య విద్యాపరిషత్తులనుండి స్వదేశపరిషత్తులు కూడ ననన్య సాధారణుఁడైన వ్యక్తిని గౌరవించుట తమ విధియని యెఱింగినవి. పంజాబు విశ్వవిద్యాలయమువారు బోసు నుపన్యసింప నాహ్వానించిరి. వంగదేశీయుల నెవ్వరిని నితనికిఁబూర్వము వా రాహ్వానించి గౌరవించి యెఱుఁగరు. బో సట్టి సన్మానములొందినవారిలోఁ బ్రథముఁడు. రెండవవాఁడు డాక్టరు ప్రఫుల్లచంద్రరే. పంజాబు విశ్వవిద్యాలయమువారు బోసునకు 1200 రూపాయలను బహూకరించిరి. బోసు తద్బహుమానమును స్వీకరించి, సహజోదార భావముతో నెలకొక 100 రూ. చొప్పున నొక పరిశోధక విద్యార్థి కుచిత వేతనముగా నొసంగవలసినదని తిరుగ వారి కొసంగివైచెను. "విజ్ఞానసంపాదనముకొఱకుఁ బూర్వము జీవకుఁడు వంగరాష్ట్రమునుండి తక్షశిల కరిగి వైద్యవిద్య నభ్యసించి, తరువాత బుద్ధభగవానునకు వైద్యుఁడయ్యెను. ఇయ్యది యిరువదియైదు శతాబ్దులకు వెనుకటిచరిత్ర. అప్పటికిప్పుడు మరల నొక విజ్ఞానయాత్రికుఁ డీ నేలకుఁ దిరుగ వచ్చెను. అందుచే జ్ఞానమన్నది యే యొక్క మానవుని సొత్తునుగాదు; భౌగోళికమైన యవధులు విజ్ఞానమును నియమించునట్టివి కావు. విజ్ఞాన మనంతమయినది. ప్రపంచము సర్వస్వతంత్రము. అన్నియుగములయందును నొక దేశము నుండి వేఱొక దేశమున కహరహము భావవినిమయము జరు

గుచు నేయున్నది. గ్రీకులు, ప్రాగార్యులు తక్షశిలలోఁ దమ తమ విజ్ఞానముల నొండొరులకు నివేదించుకొనిరి. చాల శతాబ్దములకు ప్రాక్ప్రతీచీ సంస్కృతులు సంగమించినవి. వాని సంసర్గమున ననను భూతపూర్వములయిన విషయము లుద్ఘాటింపఁబడఁగలవు. భూగోళము నావరించి ఋతువులు పరివర్తించునట్లే మానసికోన్మేషము వివిధభూఖండములమానవులయందుఁ బ్రతిభాసించుచుండును. వసంతము వచ్చినతోడనే నిగూఢమగు జీవపరిణామము సంతోషమును, శోభను సంతరించునట్లే యంతర్నిగూఢమై మరుగుపడియున్న విజ్ఞానము హిందూదేశమునఁ దిరిగి యావిర్భవింపఁగలదు. శాస్త్రము ప్రత్యేకముగ ప్రాక్ప్రతీచీదేశములలో దేనిది యునుగాక యంతర్జాతీయమైన పరిషత్తునకుఁ జెందిన దే యయ్యు, దాని యుత్పత్తిస్థానమును బట్టి కొన్నికొన్ని ఘనత నార్జించినవి. హిందూదేశము స్వభావసిద్ధమయిన సంధాన గుణముచే ననేకత్వమున నేకత్వమును గ్రహింపఁగలిగినది. ఏతద్గుణావగాహనమే నన్ను జీవపదార్థముల యొక్కయు, నిర్జీవపదార్థములయొక్కయు సంసర్గ సమైక్యవిషయములఁ గూర్చి యాలోచింపఁజేసి విజ్ఞానము యొక్క యవిభాజ్యత్వము నెఱుకపరచె" నని బోసు పరిషత్తులో గంభీరోపన్యాస మొసంగెను. ఇది శాస్త్రజ్ఞుఁడొసంగునట్టిదా! ఈతఁ డొక్క శాస్త్రజ్ఞుఁడే కాక సర్వకళాసంపన్న మూర్తీభవించిన యపూర్వ వ్యక్తియగుటచే నిట్టి పరమసత్యము లాతనినోట వెలువడఁజాలెను.

## IV

## బోసు మహాశయుని పరిశోధనలు

"జంతువులయొక్కయు, వృక్షములయొక్కయు నాడీమండలముల చర్యలను విభజింపఁగల సూక్ష్మతరమగు భేదములేదు. కొన్నికొన్ని సందర్భములలో మానవజాతుల జీవితచరిత్రవంటి జీవితవిధానమునే వృక్షములును ప్రదర్శించు" ననునది శాస్త్రజ్ఞలోకమును గగ్గోలుపఱిచిన బోసు పరిశోధనయొక్క సారము. ఈతని పరిశోధన మింతకుఁ బూర్వము చాలసంవత్సరములనుండి విశ్వసింపఁబడుచువచ్చిన వృక్షశాస్త్రి సూత్రములను బ్రతిఘటించి నూతన సిద్ధాంతములను బ్రయోగమూలమునఁ బ్రదర్శించినది. బోసు తన సిద్ధాంతమును బ్రతిపాదించువఱకును జర్మనుదేశపు వృక్షశాస్త్రజ్ఞులయిన ఫ్లైఫర్, హేంబర్లాండెట్టుల సిద్ధాంతములే సత్యములని నమ్మఁబడుచువచ్చెను. పాశ్చాత్యుల కాజర్మను శాస్త్రజ్ఞులపైనుండు ప్రమాణబుద్ధి బోసుసిద్ధాంతములను విశ్వసింపనియలేదు. ఎవరు విశ్వసించినను, విశ్వసింపకపోయినను విశ్వజనీనములగు సత్యములు ప్రచ్ఛన్నములు కాకమానవు. వృక్షనాడీమండలముయొక్క వ్యాపారమును బ్రత్యక్షప్రమాణముచే నిరూపించుచుండఁ బరప్రత్యయనేయబుద్ధులు కొందఱొకఁగాదనినఁ బోవునదిలేదు. మానవ నేత్రములమూలముననే కాక స్వీయప్రతిభచే నిర్మించిన యొక్కయంత్రసాహాయ్యమునఁగూడ నాతని సిద్ధాంతములు రుజువు చేయఁబడుచుండ నింకను విశ్వసింపనివారు తమ నేత్రములను, దమబుద్ధిని తామే విశ్వసింపనివారన్నమాట. ఈ

నూతన శాస్త్రపరికరమునకు జగదీశబోసు "రెసనెంటు రికార్డర్" (సహానుకంపనగ్రాహి) అని పేరిడెను. ఈ సహానుకంపనగ్రాహిమూలమునఁ గొన్ని బిందువులు వరుసగా గుర్తింపఁబడును. ఈ చుక్కల మధ్యకాలము సెకండులోని శతాంశము. ఇయ్యది మిక్కిలి సున్నితమయిన పరికరము. హృదయస్పందనమును సెకండులోని సహస్రాంశమువఱకునుగూడ నియ్యది గుర్తింపఁగలదు.

జగదీశబోసీ పరికరమును దాను వలసిన సలహాల నొసఁగుచుఁ బరిశీలించుచు సామాన్యులయిన పనివాండ్రచే తనే నిర్మింపఁజేసెను. ఈతని సిద్ధాంత మామోదింపఁబడిన వెనుకఁ బ్రపంచపు మూలమూలలనుండి యీ యంత్ర పరికరముకొఱకు నభ్యర్థనములు వందలకొలఁది రాఁదొడఁగెను.

ఇయ్యది యొక్కటియే కాక బోసు జంతుశాస్త్రమునకు మాత్రమే సంబంధించినవని మనము విశ్వసించు పలు విషయములలో వృక్షములు కూడ నట్లే ప్రవర్తించునని ప్రయోగమూలమున నిరూపించెను. వృక్షము తనకుఁ దగిలిన యాఘాతమునకుఁ బ్రతిక్రియ నొసంగుటకుఁ బట్టు కాల వ్యవధినిగూడ నాతఁడు కనుఁగొనెను. జంతువులలో వలెనే వృక్షములయందును మత్తుగలిగించు నిషాద్రవ్యములు లోకేవిధమయిన మార్పును గలిగించునని బోసు గ్రహించెను. విషద్రవమును సేకరించి యొక మొక్కమొదట పోయ "రిసనెంటు రికార్డరు" దానిఫలితమును వెంటనే యత్యాశ్చర్యకరముగాఁ బ్రదర్శించెను. నాడీమండలముల వ్యాపారముయొక్క వేగము వెంటనే మందగించెను.

బోసు, వృక్షములు రాత్రి 12 గంటలకు నిద్రపోయి యుదయము 8 గంటలకు నిద్రనుండి లేచునని పరిశోధించెను. ఒకటియనగేల, వృక్షజంతు శాస్త్రములకు సంబంధము లేదని యితఃపూర్వము విద్వాంసులు విశ్వసించు సర్వవిషయముల యందును దాను పరిశోధించి నూతన సత్యములను గనుం గొని వానిని ప్రపంచముచే నొప్పించి, తనతో సమానుం డయిన శాస్త్రజ్ఞుఁడు లేఁడన్న ప్రఖ్యాతిని బోసు గణించెను.

"ప్రపంచమును గగ్గోలు పఱచునట్టి యిట్టి పరిశోధన లను గావించి ప్రఖ్యాతిగాంచుట మంచిదే. అంతమాత్ర మేనా దీనిప్రయోజనము? మానవ సౌఖ్యమును వృద్ధి చేయుటకుఁగాని, బాధానివారణమునకుఁగాని యీ పరిశోధన ఫలితములు పనికివచ్చునా" యని యడుగవచ్చును. ఇట్టి ప్రశ్నసే యొక తీగనుండి విద్యుత్ప్రవాహమును బ్రసరింపఁ జేసినప్పుడు కొందఱు ఫారడేపండితుని "నీనూతన పరిశోధనము వలని ప్రయోజనమేమియో చెప్పఁగలవా?" యని యడిగిరి. అతఁడు వెంటనే "క్రొత్తగా బుట్టిన బిడ్డనుగూర్చి మీరా నందమునొందుదురుకదా? ఆబిడ్డవలనఁ బ్రయోజన మేమి?" యని ప్రశ్నించి యూరకుండెను. ప్రప్రథమమున నీపరిశోధనలు స్వల్పములు నిష్ప్రయోజనములుగాఁగనిపించును. భూమ్యా కర్షణ సిద్ధాంతము ప్రతిపాదింపఁబడినప్పుడును గొందఱు తీర్లే యధిక్షేపించిరి. ఆయధిక్షేపించినట్టివారు తరువాత శాస్త్ర వస్తు నిర్మాణములలో నుపయోగింపఁబడిన యీ సూత్ర సత్యమువలనఁగలిగిన సౌలభ్యమును గమనించిన నేమనఁ గలరో! ఈ బోసు మహాశయుని పరిశోధనలు శాస్త్రాభి

వృద్ధిని సూచించునట్టివి. ఈ సత్యములు వైద్యశాస్త్రము నందును, వ్యవసాయశాస్త్రమునందును ముస్ముం దెంతటి ప్రముఖస్థానమును వహింపనున్నవో యెవరు చెప్పఁగలరు!

జగదీశచంద్రబోసు 1906 సంవత్సరమున "వృక్షప్రతి భాషణము" (Plant response) అనుపేర నొకయుద్గ్రంథ మును రచించెను. అందలి పరిశోధిత సత్యములు శాస్త్రజ్ఞ ప్రపంచము నాశ్చర్య తన్మయులను గావించి విడిచినవి.

## గౌరవములు-బిరుదములు

1913 వ సంవత్సరమునకు శ్రీజగదీశబోసునకు నేబది యైదు సంవత్సరములును నిండినవి. ప్రభుత్వోద్యోగమునుండి విరమింపవలసిన కాలమాసన్నమయ్యెను. కాని ప్రభుత్వము వారు బోసు రాజధానికళాశాలకుఁ జేసిన సేవను బట్టియు, బోసునెడ విద్యార్థులకుఁ గలిగిన గౌరవాదరములఁ బట్టియు మఱి రెండు సంవత్సరములు పండితుని సేవను బొడిగించి యాతని పండిన విజ్ఞానముయొక్క సారమును విద్యార్థులకుఁ బంచి పుణ్యముకట్టుకొనిరి. అప్పుడయినను ఆచార్యబోసును "ఎమిరిటస్ ప్రొఫెసరు"గాఁ జేసి పూర్ణవేతన మొసంగి గౌరవించిరి. ఈ యాచార్యత్వమున నాబాల్యప్రవృద్ధ మయిన కళాశాలతోడి పరిచయము తుదివఱకు నాతని కండి యాప్యాత్మతృప్తిఁ గలిగించెను. ఇంతటి గౌరవము హిందూదేశ ములో విద్యాశాఖలోఁ బనిచేసినవారి కెవ్వరికి నంతకుఁ బూర్వము గలిగియుండలేదు.

ప్రభుత్వమువారు మొదట బోసు ప్రతిభ నెఱుంగుటలో నలసులై యుండిరి. రాయల్ సొసైటీవారు బోసు ఘనత నామోదించినవెనుక బెంగాలు ప్రభుత్వము వారుకన్నుఁ దెఱచి యాతనికిఁ గొంతసహాకారము చేయుటకు ముందుకు వచ్చిరి. ఆతఁడు ప్రభుత్వపక్షమున 'పారిస్' నగరమునందలి శాస్త్రజ్ఞ సమావేశమున కరిగెను. 1903 వ సంవత్సరములో 'సి. ఐ. ఇ' బిరుదమును, జార్జి పట్టాభిషేక సందర్భ బిరుద ప్రదానములలో 1911 వ సంవత్సరమున 'సి.యస్.ఐ' బిరుదమును, అమెరికాయాత్ర సలిపి హిందూదేశమునకుఁ దిరిగివచ్చిన 1916 వ సంవత్సరమున 'సర్' బిరుదమును ప్రభుత్వమువా రొసంగి గౌరవించిరి. 'సర్' బిరుదము సందర్భమున నెన్నియో యభినందన సభలు జరుపఁబడెను. విద్యార్థులెందఱో తమ గౌరవమును బ్రకటించుచు వందలకొలఁది సన్మానపత్రములను బహిరంగసభలలో బోసునకు సమర్పించిరి. అట్టి యభినందనసభ కధ్యక్షత్వము వహించిన శ్రీ ప్రఫుల్ల చంద్రరే పండితుఁ డమితానంద పరవశుఁడై తన యుపన్యాసములో "బోసు పట్టి పరిశోధకుఁడు మాత్రమే కాదు. ఆ విధముగ నాతనిఁబరిగణించుట తప్పు. శాస్త్రి సత్యాన్వేషణపరుఁడే కాక యాతఁడొక యుగప్రవర్తకుఁడు. ఆతని పరిశోధనలతో నొక నూతన యుగ మీ శాస్త్ర చరిత్రలోఁ బ్రారంభమైనది. బోసు స్వార్థరహితుఁడైన మహాత్ముఁడు. ఆతఁడు విద్యుచ్ఛాస్త్రమునఁ జేసిన పరిశోధనల నంతటితో వదలక తాను నిర్మించిన నిస్తంత్రీయోగ వార్తా పరికరమును బ్రపంచమున నమ్ముకొనినఁ గొట్లకొలఁది

ఆర్జించియుండును. కాని స్వార్థరహితుఁడై యాతఁడు శాస్త్రి సత్యముల నుపయోగించి ధనమార్జించుపని 'మార్కోనీ' వంటివారలకు విడిచిపెట్టెను. అతఁడు స్వచ్ఛందమైన నిరాడంబరమైన శాస్త్రవిద్యార్థి. అను విషయమును విస్మరించి బెదరించు విఘ్నపరంపరలఁ జెండాడి తన పరిశోధనలను సాగించి సాధించుటయే జీవితపరమావధిగాఁ దలపోసిన శాస్త్రిక దృక్కు.

## V

## బోసు మహాశయుని పరిశోధన శాస్త్రాగారము

బోసు మహాశయునిచే సంస్థాపింపఁబడిన శాస్త్రాగారమాచంద్రార్కమాతని కీర్తిచంద్రికలను వెదఁజల్లుచుండునట్టిది. ఆ మహాశయుని యద్వితీయమైన ఘనతకది శాశ్వతమైన నిదర్శనము. ఆతని విద్యార్థిదశనుండియుఁ బరికరములు సమగ్రముగా లేకుండుటవలని యిబ్బంది నాతఁ డెఱింగియుండుటచే సర్వసమగ్రమయిన శాస్త్రపరిశోధన పరికరములతోడి ప్రయోగశాలయొక్క యావశ్యకము నాతఁ డెన్నఁడో గుర్తించియుండెను. పరిషత్కళాశాలలు ప్రభుత్వాయాజమాన్యమున నున్నవన్నను ప్రభుత్వమువా రెంత సాయమొసర్చి శాస్త్రపరిశోధనను బ్రోత్సహించెదరో యాతనికనుభవసిద్ధమయిన విషయమే. వంగరాష్ట్రమందలి విద్యావిషయిక మాసపత్రికలోఁ "బ్రయోగమునకును సిద్ధాంతమునకును నవినాభావము కలదు. ప్రత్యక్షప్రమాణ సాధనమయిన ప్రయోగమును మాని సిద్ధాంతపఠనమాత్రమువలనను

ప్రవచనమువలనను మధ్యమశ్రేణికిఁజెందిన జ్ఞానము కలుగునేకాని యుత్తమతరగతి జ్ఞానమలవడదు. పరిశోధనముండి ననేకాని పాఠబోధనము నిష్ప్రయోజనమయినది. ఇతరుల వాక్యములయందలి విశ్వాసము వస్తువుల యథార్థస్థిత్యవగాహనమునుండి దూరీకరించును. అందుచే శాస్త్రప్రయోగశాలయొక్క యావశ్యకత ముపేక్షింపఁదగినదికాదు. ఒక విద్యాపరిషత్తుయొక్క ప్రతిష్ఠ ప్రత్యేకముగా 'నే శాస్త్రశాఖలలో నీ పరిషద్విద్యార్థులు పరిశోధించి యభివృద్ధిఁజూపిరి? ఈ విద్యాశాలాపరిషత్పరిపాలనమున నేయే పరిశోధనలు జరుపఁబడినవి? మీ కళాశాలలు పాశ్చాత్య శాస్త్రకళాశాలలకు విద్యార్థులను దయచేయుచున్నవి యేనా? పాశ్చాత్య దేశములనుండి విద్యార్థులను మీ కళాశాలలకు రప్పించునంతటి శాస్త్రాభివృద్ధి మీ రెన్నఁడయినఁ జూపనవసరము లేదా?' అను ప్రశ్నలకు వచ్చు సమాధానములపై నాధారపడియుండును. పాశ్చాత్యులను మన పరిషత్తులకు రప్పింపవలయునన్నది స్వార్థికాభిప్రాయముకాదు. ఇంతకుఁ బూర్వ మీ భరతఖండమున నియ్యది సిద్ధిఁగాంచినదే. విద్యాపీఠములకుఁ దక్షశిలానలందాలు వివిధదేశములనుండి విద్యార్థుల నాకర్షింపలేదా'' యని యుద్ఘోషించెను. ఈ యాత్మాభిప్రాయము, ఆత్మవిశ్వాసము బోసునకు వెన్నతోఁ బెట్టినట్టులే! వయస్సుముదిరి శాస్త్రజ్ఞానము పండినకొలఁది నాతని యభిప్రాయము స్థిరరూఢమయిన దనుటలో వింత లేదు.

జగదీశచంద్రబోసును యుగప్రవక్తయని ప్రఫుల్లచంద్రరే యనుటలో నెంతయో సత్యమున్నది. బోసాకఋషి.

తుల్యుఁడు. ఆతని యోగము శాస్త్రము. తక్షశిలా నలందా కంజీవరాదులకుఁబోయిచూచి వాని యౌన్నత్యమును, విశ్వాదర్శకత్వమునుగూర్చి చదివిన యీ పండితునకు హిందూదేశము శాస్త్రపరిశోధనలయందుఁగూడ ముందంజవైచి లోకమునకు ప్రమాణముగా నుండఁగలదను దృఢవిశ్వాసము జనించెను. అంతియకాక యాధ్యాత్మిక వాసనాయుతమయిన హిందూ పరిశ్రమ లేకయే యే శాస్త్రమెంత యితరదేశముల నభివృద్ధిగాంచినను సర్వసమగ్రముకాదని యాతఁడెఱుంగును. ఆ నమ్మకముతోడనే యాతని యేఁబది తొమ్మిదవ జన్మదినోత్సవమయిన 30 నవంబరు 1917 వ సంవత్సరమున పరిశోధనాగారము నాతఁడు నెలకొల్పెను. ఆ ప్రతిష్ఠ శిష్టాచార సంప్రదాయము ననుసరించి వలసిన కర్మకాండతో జరుపఁబడెను. ప్రారంభసమయమున నాతఁడిచ్చిన యుపన్యాస మా పండితుని యుపన్యాసపరంపరలలో నత్యుత్తమమయినది. ఆతని పలుకులయందును, జూపులయందును నార్షత్వము ప్రజ్వలించుచుండెను. "శాశ్వతత్వ బీజములు వస్తువునందుఁగాదు, భావమునందు; సంపదయందుఁగాదు, ఆదర్శములందుఁ—జూడనగును. ఉత్తమ మానవసామ్రాజ్యము భౌతిక వస్తుసమార్జనముతోఁ గాక యుత్తమాభిప్రాయములను, నుత్తమాశయములను వెదఁజల్లుటలో నేర్పడు"నని యాతఁడుద్ఘోషించెను. ఆ సంస్థ జ్ఞానప్రచారముకొఱకు కంకితము చేయఁబడినది. ఎట్టి జాతిమత విద్యావిషయక భేదములు లేక స్త్రీ పుంభేదము లేక వాఙ్మయభేదములు, భాషాభేదములు లేక యెల్లరకు నా సంస్థ యాశ్రయముగా నుండవలయును.

కొన్ని పాశ్చాత్యసంస్థలవా రేఁగాక యందు విదేశీయులను గూడ నాదరించి స్థానమొసఁగవలయును. ఇట్టి యాదర్శము లతో నాపూజ్యుఁడు శాస్త్రసంస్థను స్థాపించి స్థిరయశస్కుఁ డయ్యెను.

విద్యావృద్ధుఁడైన జగదీశచంద్రబోసు తన జీవిత శేషమును శాస్త్రసంస్థయందును, నితర సంస్థలయందును నుపన్యాసములిచ్చుచు, నూతన పరిశోధనల నొనరించుచు మహోలగాఁగడిపెను. శాస్త్రవిషయములఁగూర్చి భావోద్రిక్తములయిన యుపన్యాసములను దన పరిశోధనాగారమునం దొసఁగెను. పలువురు శాస్త్రవిద్యార్థులును, దదితరులును వాని నత్యాసక్తితో విని తన్మయులైరి. ఆతని శాస్త్రసాధన పరికరములను జూడవచ్చినవారంద ఱా విశేషములందలి యమానుష శక్తి నాతని కంటఁగట్టి తృప్తిచెందెడివారు. బంగాళదేశపు గవర్నరయిన లార్డులోనార్డుషే సమక్షమున "ప్రార్థనాత్మకేక దళ వృక్షవిశేషము" (Mystery of the Praying Palm) ను గూర్చి తాను నూతనముగా నిర్మించిన "క్రెస్కో గ్రాఫ్" అను యంత్రమును బ్రదర్శించి యుపన్యాస మొసఁగెను. ఒకటియన నేమి, వృక్షముల దివ్యతత్త్వమునుగూర్చి "జీవిత సమైక్యము" నుగూర్చి యాతఁ డుపన్యాసము లనేకము లొనర్చెను.

బంగాళా గవర్నరుతోడఁగూడి వైస్రాయి గారయిన లార్డు ఛెంసుఫోర్డు బోసు ప్రయోగశాలను సందర్శింప నరుగు దెంచి, యచ్చటి యద్భుతప్రయోగములను, యంత్ర పరికరములను జూచుచుఁ, బ్రశ్నించుచు, బోసు ప్రదర్శించి వివరించు

చుండ వినుచు, నెంతకాలమయినదో తెలియకయే రెండు గంటల కాలము గడపెను. బోసెండి చనిపోవనున్న రెండు వృక్షములను దీసికొనివచ్చి తిరిగి వానిని నాటి చక్కఁగా నాకులు పూవులు పూచునట్లొనర్చెను. ఇది చూచినవారి కెల్లరకు వింతగానుండెను. దుర్భిణి యంత్ర సాహాయ్యమునఁ గూడఁ దెలిసికొనుటకు వీలుకాని వృక్షముల యనుదినాభి వృద్ధిని సూచించు "క్రెస్కోగ్రాఫ్" అనన్యతుల్యమయిన యాతని నిర్మాణము. దీనివలన వ్యవసాయ శాఖ పరిశోధన లలో నూతన పరిణామములు గలిగెను. తరువాత బోసు పుష్పములు తఱచు ముకుళించుకొనుటను గూర్చియు వికసించు టనుగూర్చియు నుపన్యసించెను. ఆతఁడు తిరుగ యూరపు దేశ పర్యటనమున కరిగెను. ఇరువదియేండ్లకుఁబూర్వ మాతఁడు పాశ్చాత్య దేశముల కరిగినప్పుడు శాస్త్రజ్ఞులెట్లాతని యుప న్యాసములను, బరిశోధనలను విని యాతనిపై దండెత్తిరో యట్లే మఱలఁ గొందఱు బోసుతో వివాదమునకుదిగిరి. ఈ పర్యటనములో బోసు లండను, పారిసు, బెర్లిను, వియన్నా మొదలగు పెక్కు ప్రదేశములలో నుపన్యసించి యోగ్యతా పత్రములను, నభినందన పత్రములను బొందెను. 1920 మే 20 వ తేదీని తిరిగి హిందూదేశమున కాతఁడు వచ్చెను. తరువాత నాతఁడు ఢక్కా విశ్వవిద్యాలయములో నాగష్టు మాసములో వృక్షజీవితమునకు సంబంధించిన శాస్త్రవిషయ ములను బురస్కరించుకొని యుపన్యాసము లొసఁగెను.

# VI

## బోసుమహాశయుని గుణవిశేషములు

సర్వసాధారణముగా శాస్త్రజ్ఞులకు సారస్వత వ్యక్తీకరణ మలవడదు. నూతనవస్తు నిర్మాణ నూతన పరిశోధనము లెంత ప్రధానములో, సారస్వత వ్యక్తీకరణముకూడ నంతే ప్రధానము. శాస్త్రజ్ఞుఁడు సరస సారస్వతోపాసకుఁడగుట సకృత్తుగానుండును. కాని విరుద్ధములయిన యీ గుణద్వయము మీ బోసుపండితునియందు సామరస్యము నొందియున్నవి. ఆతఁ డెంత శాస్త్రజ్ఞుఁడో యంత సారస్వతోపాసి. ఆతని జీవితమంతయుఁ దన పరిశోధనలను శాస్త్రజ్ఞమండలులకో, శాస్త్రవిద్యార్థి బృందములకో బోధించుటతోడనే సరిపోయి నది. ఆతఁ డాజన్మోపాధ్యాయుఁడన్నను సత్యేతరము కాదు. తన పరిశోధనల నితరులకు సులభముగ బోధపడునట్లు మృదుమధురమయిన భాషలో సుస్పష్టముగను, శక్తిమంతము గను నాతఁడు వ్యక్తీకరించెడువాఁడు. ఆతని వక్తృత్వమును, భాషాపాటవమునుగూర్చి ఆచార్య సుధీంద్రబోసు "బోసు తన పరిశోధనలయొక్క రామణీయకమునను, నిరూఢసత్యము లందును తన్మయుఁడై యుపన్యసించెనా విపక్షులుకూడ వాద ప్రవాహమునఁ గొట్టుకొనిపోయి మున్కలిడి యాతనికి నమ స్కరింపవలసినవారే. ఆతఁడు మానవ బాంధవ్యరాహిత్య ము నుపాసించినవాఁడు కాఁడు. ఆతఁడు మానవత్వము పుంజీ కృతమయిన వ్యక్తి. విద్యార్థుల కాదర్శప్రాయుఁడుగను,నుపా ధ్యాయుఁడుగను బోసు సాటిలేని వ్యక్తి" యని తన యభి ప్రాయమును వ్యక్తీకరించెను.

ఒక యుపన్యాసములో బోసు తన విద్యార్థులతో "నన్ను ఎమిరిటస్ ప్రొఫెసరుగాఁజేసి ప్రభుత్వమువారు గౌరవించినది శ్లాఘాపాత్రమయినది. దీనివలన మీతోడి సాహచర్యము నాకు విడివడకుండుట మోదావహము. ముప్పది రెండేండ్లకుఁ బూర్వము నే నీ యుపాధ్యాయత్వమును స్వీకరించితిని. ఈ యాచార్యత్వమునకు మించిన యుపాధి లభించినను స్వీకరించెడివాఁడను గాను. మీరు నాయందు సునిహితము చేసిన పూర్ణవిశ్వాసగౌరవములకు నాకుఁ దెలిసిన సర్వవిషయములను మీకు నివేదించుట తక్క నేనేమి చేయఁగలుగుదును? నే నెన్నఁడును మీ లోపములను దడిమి నిరుత్సాహపఱచి యెఱుఁగను. మీ గొప్పఁదనము నే యుపలక్షించెడివాఁడను. మీ కందఱికిని సులభవిషయముల శిక్ష నొసంగక యధికశ్రమ కలిగించువానినే యొసంగి నిర్బంధించితిని. దాని ఫలితముగా నెందఱో నా శిష్యులు జీవితరంగముల నున్నతోద్యోగములలో నున్నారు. ఈ శిష్యసంసారమే నా కృషికి ననర్ఘమైన ఫలితము. శాస్త్రవిషయము లందును, దదితర విషయములందును బేరొంది కీర్తిసంపాదించిన వారిని జూచియే నేను గర్వింపను. జీవితరంగములోఁ బ్రవేశించి ధైర్యసాహసములతో సంసారయాత్ర నిర్వహించువారిని జూచియే నేనభినందించెదను. వారి స్వచ్ఛము, పరోపకారపరము నైన జీవితము నా కమితానందము నొసంగు" నని తన యుపాధ్యాయత్వమును గౌరవించుకొనుచు శిష్యవాత్సల్యమును బ్రదర్శించెను.

హిందూదేశమున గురుశిష్యులకు సంబంధము పట్టు దారములతో బిగియఁగట్టినది. గురుపాదములఁబట్టి నమస్కరించు శిష్యగౌరవము పూతమయినది. వృత్తి నిర్వ్యాజమగు ప్రేమతో శిష్యబృందముల నరయు గురువుల వాత్సల్యము కొనియాడఁదగినది. ఆర్ష సంప్రదాయ బద్ధమగు నీ భారతవర్షమున నీ గురుశిష్యసంబంధము చాల ప్రాచీనమయినది. బోసొక కులపతివంటివాఁడు. ఆతఁడు తన ముప్పది యైదేండ్ల యుపాధ్యాయత్వమున నెన్నఁడును విద్యార్థులవలన నెట్టి బాధయు నెఱుఁగఁడు.

లోకమున 'బ్రతుకు తెరువు లేకున్న బడిపంతుల యుద్యోగ' మనునుడియున్నది. అంత చులకనగా నీ వృత్తి పరిగణింపఁబడినను నిం దుదారత, గౌరవము, మానవ బాధ్యత లేకపోలేదు, తదితర వృత్తులయందుకంటె నిందే యీ బాధ్యత లధికము. ప్రభుత్వమువారు వీరిని గౌరవించు విధానమునుబట్టి యిట్టి చులకన యేర్పడియుండును. బోసు మాత్ర ముపాధ్యాయున కెట్టి న్యూనత యాపాదింపఁబడిన నంగీకరించి యూరకొనెడివాఁడు కాఁడు. ప్రారంభమునందే పాశ్చాత్య విద్వాంసులకు గౌరవ మధికముగ నొసంగి భారతీయులకు న్యూనత కల్పింపఁ బ్రభుత్వమువారితో నాత్మగౌరవరక్షణమునకై పోరాడి యతఁడు జయమొందెను. అది కాక యాతఁడు జీవితములోఁ దా నొక యుపాధ్యాయుఁడని గర్వించెనే కాని యుపాధ్యాయత్వమున కెన్నఁడును విచారించి యెఱుఁగఁడు. లోకమునుద్ధరించినవారందఱెట్టి యుపాధ్యాయులే!

బోసు నిష్కళంకమైన దేశభక్తుఁడు. దేశాభివృద్ధియే యాతని పరమాశయము. అతఁడు మొదటినుండియుఁ గార్యశూరుఁడే కాని వాక్శూరుఁడు గాఁడు. దేశమున నానావిధమయిన పునరుజ్జీవనము ప్రారంభమైనదనుట కాతని జీవితమే యొక ప్రత్యక్షోదాహరణము. హిందూదేశమున దేశభక్తియన రాజ్యతంత్రమునఁ బాల్గొని వ్యవహరించుట యని యర్థము. కాని మన దేశభక్తి యొక్క నానావిధములందే కాక శాస్త్రశాఖలయందును, కళావిషయములందును నధిక స్వాతంత్ర్యముతో గోచరించుట మన ప్రత్యక్షదృష్టము. బోసు స్వతంత్రపరిశోధనల మూలమునఁ బ్రపంచమందలి యితర దేశీయుల భావములలో భారతదేశమునందు గౌరవము కలిగినది. ప్రాచీనకాలమునందువలెనే హిందూదేశము మరలఁ బ్రపంచమునకు జ్ఞానదీపమై యాదర్శము కాఁగలదని బోసు నిరూపించెను. శాస్త్రపరిశోధనాలయమును స్థాపించి యితర దేశములనుండి శాస్త్రజ్ఞుల నాకర్షించి బోసు మన దేశమున కఖండగౌరవము గలిగించెను. ప్రాచీనకాలపు విద్యాపరిపక్వతములయిన తక్షశిలా నలందాల ప్రఖ్యాతి పునఃప్రతిష్ఠాపితము కాఁగలదని యాతఁడు పూర్ణముగా విశ్వసించినవాఁడు. ఇంతకంటె దేశభక్తి పరాయణత్వమనిన నేది? మఱుగుపడిన ప్రాంత గౌరవమును జెప్పికొని గర్వింపవలదనియు, స్వయంప్రతిభచే సంపాదించిన ఘనతను దేశమున కాపాదింపవలయుననియు నాతని జీవి సందేశము.

బోసుపనిషద్గూఢ సంప్రదాయ విదుఁడైన తాత్త్వికుఁడు. అతని విశాలభ్రూలతలు, తేజోవంతములయిన

నేత్రములు ప్రాచీనార్ష విజ్ఞానమును వెదఁజల్లుచుండెను. అజంతా గుహలలోని భిత్తికా చిత్రము లాతనికి జీవితము లోని జ్ఞానాజ్ఞానములకు జరుగు సంతతసంఘర్షణలకుఁ బ్రతి రూపములుగా గోచరించెడివి. ఆతఁ డసత్యపదార్థమునుండి సత్యపదార్థమును విభజించుచునే జీవితయాత్ర గడపెను. బహిరాచ్ఛాదనములఁ దొలఁగించి ద్వైధీభావమునఁ దోఁచు సర్వవిషయములయందు నైక్యమును, నద్వైతభావమును గ్రహించి యాతఁడు రూఢిపఱచెను.

బోసు మూడవ పర్యాయ మంతర్జాతీయ సంస్థా సమావేశమునకు బ్రతినిధిగా నరిగి లండను విశ్వ విద్యాలయ మునఁ దాను క్రొంగ్రొత్తగాఁ బరిశోధించిన విషయములపై నుపన్యసించి వారి శ్లాఘకుఁ బాత్రుఁ డయ్యెను. బోసు తాను పరిశోధించిన శాస్త్రి విషయముల నొకే గ్రంథరూపమునఁ బ్రచురించి శాస్త్రవిద్యాకృషీవలులకుఁ గడుసాయ మొన ర్చెను.

జార్జి బెర్నార్డ్షా, రోమైన్ రోలెండు మున్నగువారు బోసునకుఁ దమ గ్రంథరాజముల నొసంగి యభినందించిరి. గాల్స్వర్దీ, నాయుడ్, రెబికా, ఈట్సు, బ్రౌను మున్నగువారు స్వయముగా నాతనిని దర్శించి యభినందించిరి. భావిభారత శాస్త్రవికాసమును గూర్చి వా రాతని నుపన్యసింపు మన నాతఁడు భారతము ప్రపంచమున కాదర్శమయిన శాస్త్రజ్ఞ దేశము కాఁగలదను దృఢవిశ్వాసమును వ్యక్తీకరించెను.

బోసు ఫ్రాన్సు, ఆస్ట్రేలియా దేశముల కరిగి శాస్త్ర పరిషత్తులచేఁ బూజలనొందెను. వియన్నా విశ్వకళా పరిష

త్తులోఁ బ్రముఖ విద్వాంసుల యెదుట నుపన్యాసము లొసఁ గెను. ఆతని యద్భుత ప్రయోగములకుఁ, బరిశోధనలకును వారు తమ విద్యాపరిషత్తులో నాతని శాశ్వత సభ్యునిగా నెన్నుకొని గౌరవించిరి. వియన్నాలోని శాస్త్రి పండితులు బోసు పరిశోధనల నంగీకరించి, యాతనిఁ గూర్చి యిండియా రాజప్రతినిధికి "బోసు నిర్వచనములు, శాస్త్రి పరిశోధనలు నూతన విషయములకు మా మనోనేత్రములను దెఱచిన"వని వ్రాసి తమ పరాజయము నంగీకరించిరి.

బో సీజిప్టు వ్యవసాయ శాఖామంత్రి ప్రార్థనలను, ప్రభుత్వపు టుత్తరువులను మన్నించి యీజిప్టు దేశమున కరిగి యచ్చటఁ దనశాస్త్ర పరిశోధనలఁ గూర్చి యుపన్యసించి యచ్చటివారిని సమ్మోహితులనుగాఁ జేసెను.

పాశ్చాత్య దేశాటనమును ముగించి 1928 వ సం. సెప్టెంబరులో మాతృదేశమునకు బోసు మఱలివచ్చి విద్యార్థుల వలన నఖండ స్వాగతమును బొంది యామందానందము నొంది వారిని భావియుగకర్తలును, శాస్త్రకర్తలును గావలసినదిగా నుద్బోధించెను.

ప్రజ్ఞావంతునకు మన్ననలకు లోపమేమి? అలహాబాదు విశ్వవిద్యాలయ వార్షికోత్సవ సమయమున స్నాతకోపన్యాస మొసంగవలసినదిగా బోసును గోరిరి. స్నాతక సభకు నధ్యక్షుడైన గవర్నరు 'డాక్టరు' బిరుదమును బోసునకు సమర్పించెను. హిందూదేశము సారస్వత రంగమున, రాజకీయ రంగమున, శాస్త్రరంగమున రవీంద్రనాథ ఠాకూరు, మహాత్మా

గాంధీ, సర్ జగదీశబోసువంటి మహాశయులను సృజింపఁగలిగిననాఁడు లోకమంతయు భారతదేశముననుసరింప వలసియున్నదని నుడువుచు రాజప్రతినిధి బోసును బ్రశంసించెను. బోసు గంభీరమయిన స్నాతకోపన్యాసము నొసంగెను. ఆ యుపన్యాసమున నాతఁ డన్ని రంగములయందును విద్యార్థులను గార్యశూరులు గావలసినదని యుద్బోధించి వారికి నూతనోత్సాహము కలిగించెను.

ఆ సంవత్సరమునందే డిసెంబరు 1 వ తారీఖున శ్రీ బోసునకు 70 యవ జన్మదినోత్సవము కలకత్తాలోని యాతని పరిశోధనాగారమునందు, ఆతఁడు ప్రీతితోఁ బెంచిన వృక్షసంతానముల మధ్య నఖండముగా జరిగెను. మన దేశముయొక్క నలుమూలలనుండి యనేక ప్రపంచపు మూలమూలలనుండి యనేకాభినందనలు వచ్చి కురిసెను. ప్రముఖవ్యక్తులు, ప్రపంచపు నలుమూలలనుండియుఁ దమ సందేశములఁబంపిరి. ఇంతకుమించిన గౌరవము మానవుఁ డపేక్షించునట్టిదెయ్యది? ఆతడో, శాస్త్ర కృషీవలుఁడు. ఆతని శాస్త్ర సస్యము ఫలించినది. బంగారు శాస్త్రధాన్యము బండ్లకెత్తబడి గిడ్డంగుల నింపఁబడినది. చేతి కెముక లేకుండ నితరులకని దేశ జాతిమత వర్ణభేదములు లేకుండ పంచిపెట్టఁబడినది. ఆతఁడు ధన్యుఁడు.

తన శాస్త్ర కేదారముల వృద్ధిని దిలకించుచు శాస్త్ర కృషీవలులకు దగిన దోహదక్రియల నుపదేశించుచు దనతో సంతతము సంభాషించు ప్రకృతిదృశ్యములతో దన్మయుఁ డగుచు శ్రీ బోసు 1937 వ సంవత్సరమునఁ దనపాంచభౌతిక శరీ

రమును విడిచెను. ఆతని కీర్తితనువో శాశ్వతమైనది. ఆకాశమున ప్రభాసమన్వితములగు నుజ్జ్వల తారాగణములో నీ శాస్త్రజ్ఞ నక్షత్రము ప్రతిభా పూర్ణమై యాచంద్రార్కము నిలుచుననుటకు సంశయము లేదు. భారతము శాస్త్ర పరిశోధనల నెన్నింటినో జరిపి యన్యదేశముల కాదర్శమైననాఁ డాతనియాత్మకు తృప్తి.

# సర్ సి. వి. రామన్

వర్ధమానుఁడు, ఖండాంతర వ్యాప్త యశశ్చంద్రికా విరాజమానుఁడు, నసమాన శాస్త్రజ్ఞాన ధురంధరుఁడయిన శ్రీ సి. వి. రామనుయొక్క జననముచే హిందూ మనీష కీర్తి కెక్కుటయే కాక, తోడి నాగరిక జాతులలో నత్యున్నతమైనది కాకున్న నహీనమయిన స్థానము నాక్రమించినది. ఏ వ్యక్తియం దంతర్నిగూఢములగు ననర్ఘ గుణమణులు, ప్రజ్ఞారత్నములు గలవో యెఱుఁగఁగల దైవజ్ఞుఁడు ఒక్క కాలము. మునుముందు నివురుగప్పిన నిప్పువలెనుండునవి సాన పెట్టఁబడిన వెనుక రాణించు సహజమణులవలెఁ గాలక్రమమునఁ బ్రజ్వలితములై జనాకర్షకములగుట లోకమెఱింగినట్టిదియే. ఎక్కడో దక్షిణదేశమున తిరుచునాపల్లిలో జననమొందిన సామాన్య గృహస్థుని పుత్రుఁడు ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రజ్ఞులలో నగ్రగణ్యుఁడగునని యెవ్వరనుకొనిరి?

చంద్రశేఖర వెంకటరామను దక్షిణ హిందూస్థానమునఁదిరుచునాపల్లిలో క్రీ. శ. 1888 వ సంవత్సరమున నవంబరు మాసమున నేడవ తేదీని జననమొందెను. ఆతని తండ్రి చంద్రశేఖర అయ్యరు. ఆయన స్థానిక విద్యాశాలలో నొక యుపాధ్యాయుఁడుగ నుండెడివాఁడు. రామను పుట్టినతరువాత విశాఖపట్టణమునందలి మిసెస్. ఎ. వి. యన్. కళాశాలాధ్యక్షులు తమ కళాశాలలో చంద్రశేఖరయ్యరుగారి కుద్యోగమిచ్చి యుచ్చుటకుఁ బిలిపించిరి. కళాశాలోద్యోగమనిన నాశా

జనకముగాను, నభ్యుదయాశంసిగాను ఉన్నది గాని ప్రయాణ సౌకర్యములు లేని యాదినములలో దిరుచునాపల్లినుండి విశాఖపురికి ప్రయాణము సాగించుట సులభసాధ్యముగాదు. అయినను నా యుద్యోగము నాతని నాకర్షించినది. చంద్రశేఖర దంపతులు కష్టనష్టముల కోర్చి నాటుబండ్ల మీఁద తమ కుమారునితో విశాఖపురి కరుగుదెంచి యందు స్థావర మేర్పరచుకొనిరి. ఇప్పుడయినచో ఖండాంతర ప్రయాణ మయినను బాధాకరము కాదుకదా. చెక్కు చెమర్పకుండఁ జేయవచ్చును. కాని యాదినములలో దీర్ఘప్రయాణములు చేయవలయునన్న నెంతటి కార్యదీక్ష, ధైర్యసాహసములు, కడంకలుండవలయునో యూహింపవలయును. తల్లిదండ్రుల యీ కార్యదీక్షా స్థైర్యములే రామనునందును సుస్థాపితము లయిన పిత్ర్యగుణములు. ఈ గుణములే శాస్త్ర పరిశోధనల యందు రామనునకు ప్రాపుగానిలిచి యాతని విజయములకుఁ దెలియని కారణములయినవి. ఇట్టి కార్యశూరత్వాదర్శక మగు గుణసంపదకంటెఁ దల్లిదండ్రులు కుమారులకుఁ బంచి పెట్టఁగల కాణాచి మఱొండెద్ది?

చంద్రశేఖరయ్యరు పదార్థవిజ్ఞాన శాస్త్రమును, గణిత శాస్త్రమును బోధించుచుండెడివాఁడు. ఆయనకు బహు విషయములం దాసక్తి, పరిచయము గలదు. గణితమునకును, శాస్త్ర పాఠములకు నున్నతాధ్యయనములందు నవినాభావ సంబంధము. చంద్రశేఖరయ్యరుగారికి రెంటియందును నసామాన్యమయిన ప్రజ్ఞ గలదు. ఇంతియగాక జ్యోతిశ్శాస్త్రము నందును, సంగీతమునందును నా పండితున కభిరుచి యధి

కము. ఈ సంస్కార మాతనికి వంశపారంపర్యముగా గలిగినది. ఈపైతృకసంపద కుమారుఁడగు రామనునకుఁగూడ సంక్రమించినది. శాస్త్రజ్ఞుఁడై ధ్వని విషయిక పరిశోధనలు రామను చేయుట కాతని తండ్రికి వీణావాద్యమునందుఁగల ప్రేమాతిశయములు కారణము లనుకొనుట యసంగతము కాదు.

ప్రాథమిక మనః ప్రభావములు :

చిరుత ప్రాయముననే శాస్త్రాభ్యసనమునకుఁ బరిస్థితులు సుముఖముగా నున్నను రామునకు మతవిషయములనినఁ బూర్ణమగు నుదాసీన భావము జనించినది. దీని కాతని తల్లిదండ్రు లంత సనాతనాచారపరులు కాకుండుటయే కారణము కానోపు. ఆ దినములలో డాక్టరు అనిబీసెంటమ్మగారు మత విషయిక సంస్కారముల హిందూ సంఘమునఁ బ్రవేశపెట్ట ననర్గళోపన్యాసములతో దేశమును బ్రబోధములచేఁ బ్రతిధ్వనింపఁ జేయుచుండెను. ఆమెశంఖారావ మీతని శ్రవోరంధ్రములఁ బడినది. అప్పటికి రామను పండ్రెండేండ్లవాఁడు. మతమన్న నాతనికిఁ గ్రొత్త. ఆలోచనాపరుఁడగు నా కుఱ్ఱని హృదయమును అనిబీసెంటునభిప్రాయములుకొంత కలవర పెట్టినవి. అవి మతమన్నఁ దెలిసికొనవలయునను జిజ్ఞాసను గలిగించినవి. ఈజిజ్ఞాస ప్రబలమయినది. శాస్త్రవిషయిక ప్రశ్నాత్యాసక్తిగూడ దీనిచే సన్నగిల్లినది. దీకుతో మతగ్రంథములఁ బరిశోధింప నాతఁడు ప్రారంభించెను. పదార్థ విజ్ఞాన శాస్త్ర గ్రంథములకు బదులు రామాయణ మహాభారత గ్రంథములు తరచుగాఁ దఱచఁబడుచుండెను. రామనెప్పుడును

నేకార్యమును సగముచేసి విడుచు స్వభావము గలవాఁడు కాఁడు. భర్తృహరిమతములో బ్రారబ్ధాగ్దముల నుజ్జగింపని సజ్జనులలోఁబరిగణింపఁదగిన ధీరోత్తముఁ డితఁడు. మత గ్రంథపరిశోధనము సమగ్రముగా జరిగినది. రామను బి. ఏ. తరగతిలో మదరాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలోఁ బురాణ కవిత్వమును గూర్చి వ్యాసమును వ్రాయవలసి వచ్చినప్పుడు 'హిందూ పురాణము'లను శీర్షిక నెత్తి తన పూర్వపరిచయ జ్ఞానము నుపయోగించి చక్కని వ్యాసమును వ్రాసి, వ్యాస రచనకుఁ బ్రథమ బహుమానము నొందెను. అంతగా మత వాఙ్మయమును సూక్ష్మముగా బరిశీలించినను నాఁతని మత జిజ్ఞాస చిరస్థ మయినది కాదు. శాస్త్రజిజ్ఞాస యాజన్మ సిద్ధ మయినది. తాత్కాలిక మయిన మతాసక్తము శాస్త్ర మునకు స్థానమీయక తప్పినది కాదు. ఇంతకును రామను ప్రకృత్యా శాస్త్రజ్ఞుఁడు. తిరిగి శాస్త్రచింతనమునందే యాతని యాత్మ యానందమును జూరఁగొన్నది.

రాజధాని కళాశాలలో రామను :

1901 వ సంవత్సరమున రామను రాజధాని కళాశాలలో మదరాసులో బి. ఏ. తరగతిలోఁ జేరెను. బి. ఏ. రెండు తరగతులకు నాంగ్ల పద్యమును బోధింప వచ్చిన ప్రొఫెసరు ఇల్లియట్ తరగతిలో నందరికంటెఁ జిరుతవాఁ డయి యున్న రామనునిఁ జూచి యా తరగతికిఁ జెందిన వాఁడు గాఁడని తలంచి 'నీ వీ క్లాసునకుఁ జెందిన విద్యార్థివేనా' యని ప్రశ్నించెను. ఆసన శ్రేణులయం దుపవిష్టులయిన వారంత యొక్కపెట్టున కరతాళ ధ్వనులతో నవ్విరి. ధైర్య

ముతో రామును లేచి 'అవును, నే నీ తరగతికిఁ జెందినవాఁ డనే, నావయస్సు 13 వత్సరములు, ఇంటరు తరగతిని వాల్తేరు కళాశాలలోఁ జదివితిని. నాపేరు సి. వి. రామను' అని క్రమముగా నాచార్యుఁ డడిగిన ప్రశ్నములకు సమాధాన మొసంగెను. ధైర్యముతో, తత్క్షణ మీయఁబడిన సమాధానములు, నాతనిమిక్కిలి చిరుత ప్రాయము, ఆకారపు ప్రాశస్త్యత సమకూడి ప్రొఫెసరు నాశ్చర్యచకితునిఁ జేసినవి. నాఁడు మొదలు రామను ఆ ప్రొఫెసరునకు ప్రియ శిష్యులలో నొక్కఁ డయ్యెను.

రామను బంధువు లందఱును గవర్నమెంటు నుద్యోగ సంబంధమయిన పోటీలకు చరిత్రాధ్యయన మెక్కుడు సహాయకారి యగుట చరిత్రను నభిమాన విషయముగా గ్రహించి చదువు మనిరి. అదికాక రామను వంశమున ప్రభుత్వోద్యోగు లెవ్వరును లేరు. రామను తప్పక ప్రభుత్వోద్యోగమును సంపాదింపవలయునని వా రభిలాష పడిరి. కాని రామను భవిష్యద్వైజ్ఞానిక ప్రముఖుఁడు కాఁదలచిన రాము నేల దాని నంగీకరించును! అభిరుచిగల విషయమును గాక వేఱొండు దాని నేల గ్రహింపవలెనని దృఢవిశ్వాసముతో వారల సలహా నాతఁడు నిరాకరించెను. చరిత్రాధ్యయనమున కంగీకరించి యుండినచో నింతటి కార్య దీక్షతో నెంతటియపూర్వచరిత్రను ద్రవ్వి తలకెత్తెడివాఁడో! అప్పుడో లోకము ఒక మహాశాస్త్రజ్ఞుని పోఁగొట్టుకొని యుండెడిది కాదా.

అధ్యాపకుల కందఱికిని రామను ప్రీతిపాత్రుడై వారి వాత్సల్యమును జూరగొనుచుండెను. తాత్త్వికాధ్యయనములు

మూలంబడెను. మత విజ్ఞాన పరిచయము తీవ్రతరమయిన శాస్త్ర పరిశ్రమ కాటంకము గలిగింప లేదు. రామను చాల తొందరగాఁ జదువు స్వభావము కలవాఁడు. ఆ అలవా టిప్పటికి నాతని యందు స్థిరమయి యున్నది. ఏమాత్రపు టస్వస్థత గలిగి యింటియొద్ద విశ్రాంతి గైకొనుచున్నను నాలుగు మూఁడువందల పుటలు గల నవలను రెండుమూఁడు గంటలలో నతఁడు పూర్తిచేయు చుండెడివాఁడు. ప్రసిద్ధ గ్రంథకర్తల రచనలన్నింటిని నాతఁడు జదివి విడిచెను. శాస్త్ర పరిశోధనలను నెల్లను దాను జదివెడివాఁడు. స్వీయప్రయోగములను కళాశాలాప్రయోగాలయమునఁ జేయవలయునని యాతఁ డూహించెను గాని యాతని యుపన్యాసకుఁ డంగీకరింపక పోవుటచే వాని కంతరాయము కలిగెను. కాని యచిరకాలముననే యాతని శాస్త్రమనీషకు స్వైరవిహార మొనర్చుటకు వీలయినయవకాశము లభించెను.

శాస్త్రజ్ఞ జీవిత దశారంభము:

ఇప్పుడే రామను శాస్త్రజ్ఞ జీవితదశ యారంభమయ్యెను. బి. యే. తరగతిలోఁ బ్రథమ శ్రేణిలో నుత్తీర్ణుఁడయి, భౌతిక శాస్త్రము నందలి పారీణతకు ఆర్ని బంగారు పతకమును బహూకృతిగ నొంది, రామను యం. ఎ. తరగతి యందుఁ బ్రవేశించెను. అం దాతని యభిమాన విషయము పదార్థ విజ్ఞాన శాస్త్రము. ఆచార్యజోన్సు పండితుఁడు నాఁడు వారి కధ్యాపకుఁడు. రామను సహాధ్యాయియైన వి. యప్పారావనునతఁడు ధ్వనిశాస్త్ర విషయిక ప్రయోగముల నాచరించుచు నియమవిరుద్ధ ధర్మముల నాలోకించి, యాశ్చర్య

పడి యాచార్యుఁడైన జోన్సు పండితునకు నివేదించెను. ఆ పండితుఁడును వాని లక్షణము లింతకుఁ బూర్వ మెఱుంగని వాఁడగుట వాని వివరణ పద్ధతిఁ దెలియక విచారణా నిమగ్నుఁడయ్యెను. రామను క్షణములో నాప్రయోగపద్ధతి నవగాహనము చేసి మరునాఁడు తాను స్వతంత్రముగా నాప్రయోగమునే చేసి, యనుమానమును గూర్చి గృహమునకరిగి లార్డు రేలేపండితుని ధ్వనిసిద్ధాంతముల దృష్ట్యా పరిశీలించి, తన ప్రయోగసిద్ధాంతముల సత్యమునందు స్థిరాభిప్రాయుఁడయ్యెను. సవ్యముగా నా ప్రయోగము నాచరించిన మెడలే పండితుని ప్రయోగ ఫలితములకంటె మనోహరములయిన ఫలితములను గనుగొన వచ్చునని విశ్వసించి, ప్రయోగవిధానమున నొనరించ వలసిన కొద్ది మాత్రపు మార్పులను నాతఁడు సూచించెను. ఈ సూచనను శాస్త్రజ్ఞులందఱు చకితులై పరిశీలించి యామోదించిరి. లార్డు రేలేపండితుఁడును రామనుసూచనను శ్లాఘించెను. ఈ పోగడ్తలు శాస్త్రజిజ్ఞాసనునినుమడించి ప్రోత్సహింప రామను తానుగమనించిన విషయములను గ్రోడీకరించి యొక వ్యాసమును వ్రాసి దానిని పరిష్కరించి సంస్కరింపవలసినఁ దెలుపవలసినదిగా జోన్సు పండితునకుఁ దన వ్రాఁత ప్రతి నొసంగెను. ఎందువలననో యాపండితుఁడు రామను వ్యాసమును బరిశీలింపను లేదు; దానిని తిరిగి యాతని కర్పింపను లేదు. అనుమానములు గడచినవి. రామను శాస్త్రజ్ఞుని కుతూహల మధికమయ్యెను. తిరిగి సాఫువ్రాసి తెచ్చెద నను మిషతో నా కాగితములను తన యాచార్యుని కడనుండి తీసికొని వచ్చి, 'ఫిలసాఫికల్ మేగ

జిక్ ఆఫ్ లండను' పత్రికా సంపాదకునకు దాని నాతఁడం
పెను. ఈ విషయమును జోన్సు పండితునకు రామను నెఱుక
పరుప లేదు. మఱికొద్ది కాలములో లండను పత్రికనుండి
పునర్ముద్రితములయిన యచ్చు ప్రతులు రామునకుఁ బంపఁ
బడినవి. రామ నుత్సాహమునకు మేర లేదు. లండను పత్రికలలో
ప్రతిభాపూరితములయిన శాస్త్రపరిశోధనలనుదప్ప సామా
న్యములయిన యితర విషయములను ముద్రింపరు.
వ్యాస మందు ముద్రింపఁ బడుటయే యొక ఘనత. ఆ యచ్చు
ప్రతులఁ గైకొని రామను ఆచార్య జోన్సుకడ కరిగి వాని
నాతనికిఁ జూపించెను. అచ్చు ప్రతిని జోన్సు పండితుఁడు చదివి
కొంత తృప్తి, కొంత మనోవికలత్వము దోచు మొగముతో,
'నీవు లండను పత్రికకుఁ బంపునపుడు నాతో నేల చెప్పవైతి'
వని ప్రశ్నించెను. '' మీరు దానిని చదివి పరిష్కరించితి
రని తలంచితిని. లోపల దిద్దుపాట్లు లేకుండుటచే నియ్యది
నిర్దోషమయినదని మీరెంచినట్లు భావించితిని. అయ్యో!
ఎంతపని చేసితి''నని రామను నొచ్చుకొనుచు సమాధాన
మిచ్చెను. ఆచార్యుఁడు సంతృప్తి నొందినట్లు తోచెను. మానవ
మనస్తత్త్వము విభిన్నమయినది. ఆత్మగౌరవ బీజములు,
సహంకార హేతువులు విచిత్రమైనవి కదా!

మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలోనున్న రెండు వత్స
రములలో 'నేచరు' అను పత్రికకు రామను వేఱొక వ్యాస
మును పంపెను. ఈ పర్యాయము ధ్వనిశాస్త్ర విషయి
కము కాక దృక్ప్రసరణమును గూర్చి పరిశోధించి యంపెను.
విద్యార్థిదశలోఁ బ్రకటింపఁబడిన యీ వ్యాసద్వయము

రామను భవిష్యద్విమర్శనములకు నాందీ ప్రాయమైనది. తరువాతఁ బై రెండు శాస్త్రముల యందును నాతఁడు గొప్ప పరిశోధన గావించెను. చాలమందికి ప్రారంభ దశలోఁ బరిశుద్ధమైనమార్గ మలవడదు. అదిగాదిది, ఇదిగాదది యని యేదో నిశ్చిత మార్గమునకు వచ్చు సరికి చాల కాలయాపన మగుటయేకాక శక్త్యుత్సాహములు నష్టమగును. అట్టి దేదియును లేక శాస్త్రపథమున మొట్టమొదటనే విశుద్ధ మార్గముబట్టి తుదివఱకు నిర్వహించు భాగ్యము పట్టినది శ్రీ రామను శాస్త్రజ్ఞు లొక్కనికే యనుట యతిశయోక్తి కాదు.

## II

### ఉద్యోగ ప్రయత్నము : తల్లాభము

రామను యం. ఏ. పరీక్షలో నుత్తీర్ణుఁడయ్యెనో లేదో ఆచార్య జోన్సు శిష్యవాత్సల్యమున మదరాసు ప్రభుత్వము వారితో రామనును పాశ్చాత్య దేశములకు నధిక శాస్త్రజ్ఞానసంపాదనార్థము విద్యార్థిగాఁ బంపవలయునని సంప్రదింపులు చేసెను. ప్రభుత్వము వా రంగీకరించిరి. కాని యొక యంతరాయము ఘటిల్లెను. అది రామను శరీర దౌర్బల్యము. ఆతఁ డెంత ధిషణాదార్ఢ్యము కలవాఁడో యంతటి శరీర దౌర్బల్యము కలవాఁడు. చిన్నతనమున బలహీనుఁడగు రామనును శీతోష్ణసితులలోని భేదమునకుఁ దాళఁగలుగుదునా యను సంశయము బాధించుచుండెను. మండల వైద్యశాఖాధికారి యాతని శరీరమును బరీక్షించి, సముద్రయానము, పాశ్చాత్య దేశవాసము లాతనికి సరిపడవని యభి

ప్రాయ మొసంగెను. దీనితో రామనునకు ఐరోపా దేశమున కరుగు నాశ లడుగంటినవి. అయిన రామ నే యుద్యోగము నవలంబింప వలయును? న్యాయవాది వృత్తియన్నను, నుపాధ్యాయ వృత్తి యన్నను నతని కంత యిష్టము మొట్టమొదట నుండియును లేదు. ఏమయినను గాని యశాస్త్ర పరిశోధనాసక్తి యాతనిని వదలలేదు. భావి నుత్తమ తరగతి శాస్త్రజ్ఞుడు కానున్నవాని కితరముల యెడ మనస్సెట్లు పోవును? శాస్త్ర మాతనికి వలపురాణి.

ఆతని కింక నొక్కటియే యున్నది యుద్యోగమార్గము. అయ్యది హిందూ ఆర్థిక శాఖలో ప్రవేశించుట. దానికి పోటీ పరీక్షలో నుత్తమశ్రేణిలో రావలయును. ఏదో శ్రమపడి యొక్కపండితుడే రామను నొక ప్రత్యర్థిగాఁబంపి ప్రభుత్వము వారి యనుమతి నొందెను. ఈ పోటీ పరీక్షలు కలకత్తా నగరమున జరుగును. దానికొఱకు చరిత్ర, సంస్కృతము, రాజ్యాంగార్థిక శాస్త్రములు రామ నభ్యసింప వలసియున్నవి. శాస్త్రజ్ఞుడైన రామనున కట్టివానియెడ మొదటినుండియు నిష్టము లేకున్నను దప్పనిసరి నభ్యసింప వలసి వచ్చి చదువుటకుఁ బ్రారంభించెను. రేపటిదినమునఁ బరీక్షయనఁగా రామనునకు ఎం. యే. తరగతిలోఁ బ్రథముఁడుగా నుత్తీర్ణుఁడగుట యేకాక ప్రథమ తరగతిలో నుత్తీర్ణుఁడైనట్లు తంతివచ్చెను. రామనునకుం బూర్వము గాని, తరువాతఁగాని మదరాసు విశ్వకళాపరిషద్విద్యార్థులలో భౌతిక శాస్త్రమునఁ బ్రథమశ్రేణిలో కృతార్థులైన వారు లేరు. ఈ యసాధారణమైన విజయము రామనును శాస్త్ర విద్యాభ్యాసమునకుఁ బూర్వము

కంతెను ప్రదేశించెను. ఇట్టిఁడు తాను నిలఁబడు పోటీపరీక్షలోఁ ప్రథమ శ్రేణిలో విజయవంతుఁడు కాకుండునా? ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణుఁడగుటయు, డిప్యూటీ 'ఎక్కవుంటెంటు జనరల్ ఆఫ్ ది పైనాన్సు డిపార్టుమెంటు'ద్యోగము నొందుటయు నొకేపరి జరిగెను. ఆఫీసరగునపరికి రామునకుఁ బదిమెనిమిదియేండ్లు. ఇంత చిన్న తనములో నిరువదియేండ్లు నిండకుండ నున్నతోద్యోగమును సంపాదించినవారెవరును లేరు. ఈతఁ డీ విషయమునఁగూడ దదితరములందువలె నద్వితీయుఁడు.

రామను వివాహము:

రామను కొంతలోఁ గొంత ధనికుఁడయ్యెను. క్లిష్టము లయిన జీవిత సమస్యల నెదుర్కొనవలసిన సమయము మరుదెంచినది. దక్షిణ హిందూదేశమున 'సీ కష్టమ్సున' సూపరింటెండెంటుగా నున్న కృష్ణస్వామి యయ్యరునకు సుసూపవతి యగు నొక కూఁతురు గలదు. కృష్ణస్వామిగారి భార్య రామను యొక్క యసామాన్య ప్రతిభావిశేషమునకు వెఱగుపాటు నొంది యాతనినే తన యల్లునిగాఁ గైకొనఁ గోరెను. కాని కృష్ణస్వామి కంగీకారము కాలేదు. ఏలయన కృష్ణస్వామియు వేంకటరామ నొకే బ్రాహ్మణశాఖకుఁ జేరినవారు కారు. ఆచార విరుద్ధమయిన యిట్టి వివాహమున కాచార పరాయణుఁడగు నాతఁ డంగీకరింప లేదు. ఆతని కూఁతు రాతనినిఁ దప్ప వేఱొకనిని వివాహమాడనని దీక్ష వహించెను; తప్పనిసరి కృష్ణస్వామిగా రంగీకరించిరి. వివాహము వైభవోపేతముగా జరిగెను. పలువురు పెద్దలు వివా

హామునకు వచ్చి వధూవరుల నాశీర్వదించి శాఖాంతర వివాహము నాచరించినందుల కొరకు వంశీయులను గొనియా డిరి, ఆ పెండ్లికూతురు పేరు త్రైలోకసుందరి. ఈ వివాహముతో రామనునకు గార్హస్థ్య విధులు సంక్రమించెను. వివాహముతో రామనునియొక్క విద్యార్థి దశకు భరతవాక్యమును, నుద్యోగదశకు నాందీప్రస్తావనయు నయ్యెను.

## III

## దేశాటనము - ఉద్యోగ నిర్వహణము

హిందూ దేశ ప్రభుత్వార్థిక శాఖలో డిప్యూటీ ఎక్కవుంటెంటు జనరల్ పదవి నొంది రామను కలకత్తాలో నివసింపవలసి వచ్చెను. అట్టి యున్నతోద్యోగము భావిలో నౌన్నత్యదశ నూరించుచు లభ్యమయిన వెనుక రామను గాక వేఱొకఁడయినచోఁ దన శాస్త్ర వ్యాసంగమును మరచి యుద్యోగమునే భూలోకస్వర్గముగఁ బరిగణించుచుఁ దన్నుఁ దాఁ దెలియక వర్తించెడువాఁడు. కాని రామనునకు మాత్రము హృద్గతమయిన శాస్త్రపరిశోధనతృష్ణ తగ్గలేదు. కార్యాలయమున నుద్యోగ ధర్మమును నిర్వర్తించునే కాని తదితర సమయములందు నతఁడు శాస్త్రగ్రంథ పరిచయముననే కాలమును వెళ్లఁబుచ్చును. ఒకనాఁ డాతఁడు ట్రాముబండిలో నుండి కలకత్తా వీథులగుండఁ బోవుచుండ నాతని శాస్త్రి తృష్ణను రేకెత్తింపనో యన్నట్లు "శాస్త్రాభ్యసనమునకైన హిందూ వైజ్ఞానిక సమాజ"మను విలాసమునుజూచి 'యది సత్యమా! కాదా! ఇట్టిది స్థితిరూపము

నొంది హిందూదేశమున నున్నదా' యను సంశయాందోలిత మయిన మనస్సుతోడనే రామను ట్రాముబండిని దిగి యా సంఘ భవనములోని కరిగెను. అప్పటికప్పుడే, శాస్త్రి విద్యార్థి సమావేశ మయిపోయినది. ఎక్కడివా రక్కడికి పోవుచుండిరి. అచ్చట నున్నవారిలోఁ గలకత్తా విశ్వకళాపరిష దుపాధ్యక్షులయిన శ్రీ సర్ ఆష్టోష్‌ముఖర్జి మహాశయుఁడుకూడ నుండెను. రామను తత్సంఘ గౌరవ కార్యదర్శియు, కీర్తి శేషులును, విజ్ఞాన ప్రదాతయు నగు మహేంద్రలాలు సర్కార్ కుమారుఁడు నగు డాక్టరు అమృతలాలు సర్కారును గలిసికొని మరునాఁడు వచ్చి సంప్రదించుటకు కాల నియమము నేర్పాటు చేసికొని వెడలిపోయెను. మరునాఁడు వారిరువురును నియమిత కాలమునకే సమావేశు లయిరి. రామను తాను ప్రచురించిన శాస్త్రి పరిశోధనల నాతనికిఁ జూపెను. సర్కా రాతని యనన్య తుల్యమయిన శాస్త్రిప్రతిభ కబ్బురపాటు నొంది స్వతంత్రముగాఁ బ్రయోగముల నెరవేర్చుకొనుట కతనికిఁ బ్రత్యేక సౌకర్యము లొనర్చుటకు నంగీకరించెను. వెంటనే రామను వైజ్ఞానిక సమాజమున సభ్యుఁడయ్యెను. ఆతని యద్భుతమైన విద్యార్థిదశ, పేరొందిన పరిశోధనల నెల్లర నాతనిం గౌరవింపఁ జేసినవి, ఇదియే భగవంతుని విచిత్ర సంఘటనము. ఘటనాఘటన సమర్థుఁడన్నది భగవంతునికే చెల్లు విశేషణము. రామను శాస్త్రతృష తీరుటకు వైజ్ఞానికసభాసభ్యునిగా నొనర్చిన భగవంతుని యపూర్వ సంఘటనము విచిత్రమయినది. సభ్యుఁడయిన వెనుక రామనునకును, నాష్టోష్ ముఖర్జి మహా

శయునకును బరిచయము కలిగెను. ఏ శుభగ్రహ సన్నివేశ మున నాయిరువురి సమావేశము సంఘటిల్లెనో, వారి మైత్రి చిరస్థాయి యగుటయేకాక రామను జీవిత పథమునే మార్చి నది. రామనునకు శాస్త్రప్రయోగ శాలావశ్యకము కలదు. భారతీయ వైజ్ఞానిక సమాజమునకో రామనువంటి శాస్త్ర జ్ఞుని యవసరమును కద్దు. అన్యోన్యాశ్రయ భావమున రెండును వన్నె చెందినవి. రామను స్వతంత్రముగా శాస్త్ర పరిశోధనలను బూర్వపు టుత్సాహముతో సాగించుచుండెను. వైజ్ఞానిక సమాజపు పేరుప్రతిష్ఠలు దూరదూరములకుఁ గూడ వ్యాపింపఁ జొచ్చెను. రామను హృదయము కుదుటఁ బడినది. తన పరిశోధనలను రామను వైజ్ఞానిక సంఘ పక్ష ముననే ప్రచురించు చుండెను. మూఁడేండ్ల పాటే రామను కలకత్తాలోనున్నను కలకత్తా యంతటను నతని ఘనత ప్రాకినది. ఆతని శ్రద్ధాపూర్వక మయిన శాస్త్రాభినివేశము ప్రతిగృహపు ముచ్చట విషయమయినది. సర్ గురుదాస్ బెనర్జి, రామను నెడ మిక్కిలి యాదరాభిమానములు గలి గిన వాఁడయ్యెను.

ఉద్యోగ ధర్మమును స్వీకరించిన వాని వాసమునకు స్థిరత్వ మెక్కడిది? రామనునకు రంగూను బదిలీయయ్యెను. వైజ్ఞానిక సమాజమునకు రామను సేవ కోల్పోవలసిన సమయ మరుదెంచెను. కాని సకాలోప్తములయిన శాస్త్ర బీజములు ఫలవంతములు కాక మానవు కదా! రంగూను నందు గూడ రామను శాస్త్ర వ్యాసంగమును మానలేదు. ఉద్యోగ ధర్మమును నతి చాకచక్యముతో నొనరించుచు

పై యధికారుల మన్ననలకుం బాత్రమగుచుండెడివాఁడు. ఆతని చురుకుతనమున కచ్చెరు వొందనివారు లేరు.

రంగూనునందుండగా రామను తండ్రి మరణించెను. అందుచే నాలు మాసములు సెలవుగైకొని మదరాసునకు రామనువచ్చి యచ్చట తన పూర్వ శిక్షణరంగమయిన ప్రెసిడెన్సీ కళాశాలా శాస్త్రప్రయోగ శాలలోనే తన సెలవునంతయు గడిపెను. తరువాత రామను నాగపురమునకు బదిలీ చేయఁబడెను. ఇచ్చట నాతనికి సహోద్యోగులతోఁ గొన్ని బాధలు గలిగినవి. ఆ దినములలో నాగపురమున ప్లేగువ్యాధి వ్యాపించి యుండెను. రామను తన సహోద్యోగులతో గుడారములోనుండి నాగపురపు వాసులకుఁ దగిన సేవయొనర్చి ప్లేగు వ్యాధి యంటకుండఁ గాపాడుకొనఁ గలెను. సహోద్యోగులతోడి వైరము సిమ్లాలోని యున్నతోద్యోగుల కర్ణములఁ గూడఁ బడెను. వయస్సున పిన్నయయినను చాకచక్యమునఁ బ్రవర్తించి, కార్యాలయోద్యోగి వర్గమును తనకు విధేయులనుగా నొనర్చుకొని శాంతియుతముగ కార్యమును సాగించిన రామనును వా రెంతయో శ్లాఘించిరి.

నాగపురము నుండి రామనునకుఁ దిరుగ కలకత్తా బదిలీయయ్యెను. ఆతని హృదయము జన్మభూమికి వచ్చిన ట్లానందమున నోలలాడెను. వచ్చినదే తడవుగా వైజ్ఞానిక సమాజపు కార్యక్రమమునఁ బాల్గొని స్వీయపరిశోధనలను గావింపఁ దొడఁగెను. 'ప్రపంచమున నెన్నియో దేశములందుఁ దిరిగితిని. అసంఖ్యాకములగు పట్టణముల దిలకించితిని. అమెరికా దేశమందలి యనేకములయిన ప్రయోగశాలలలోఁబరిశో

ధించితిని. కాని కలకత్తానగరమే నా కర్తవ్యమైనది. కలకత్తాలోని వైజ్ఞానిక సమాజమే శాస్త్రప్రచారమునకుత్తమమైనదని భావించెద' నని యూరెంటితోడ తాదాత్మ్యమును నాతఁడు పేర్కొని సంభరభరితుఁడయ్యెడివాఁడు. ప్రతి వ్యక్తికిని సహేతుకముగనో, నిర్హేతుకముగనో కొన్నిటియందుఁ బక్షపాతముండుట మానవసహజము. ఈ యత్యంతాభిలాష సహేతుకమయినచో గర్హించువా రెవ్వరు ?

ఆచార్య పీఠము :

ఆ దినములు సర్ ఆష్టోష్ ముఖర్జీ మహాశయుని గంభీరప్రకృతి వంగరాష్ట్రమును తేజోవంతముగ నావరించి నట్టిది. ఆతఁడు వట్టి విద్యాక్షేత్ర కృషీవలుఁడు మాత్రమే కాదు. విద్యాకృషీవలత్వమునకు మించిన సంస్థా నిర్మాణచణుఁడు. క్రీ.శ. 1915 సంవత్సరములో మహోదారులగు సర్ తారకనాధ పాలిట్ డాక్టరు రాష్ బెహారీ ఘోషుల విరాళవైభవముల సహాయమున నెన్నియో యిడుముల కగ్గమైతుదకుఁ గలకత్తా విశ్వకళాపరిషత్తున శాస్త్రకళాశాలయొకటి ముఖర్జీ పండితుఁడు నెలకొల్పెను. భారతీయవైజ్ఞానిక చరిత్రమున నియ్యది నూతనశకమున కాది. విద్యావ్యాసంగులలోఁ జిరస్మరణీయుఁడయిన తారకనాథుని విరాళము లౌకికయాచార్యపీఠమును దరతరములు పోషింపఁ జాలినదై యుండెను. నలువైపులనుండి భూరి విరాళముల రూపమున ధనము ప్రవహించుచు వచ్చుచుండెను. వలసినసౌకర్యములు సమకూర్పఁ బడుచుండెను. కాని నిర్వహింపఁగల వైజ్ఞానికాచార్య బృందము మాత్రము మృగ్యముగా నుండెను.

ఆష్టోష్ ముఖర్జీ పరిమత్క-శాశాలలనుండి పట్టభద్రులై వచ్చిన పలువురను బిలిపించి సమాలోచనలు సల్పి విమర్శించెను గాని వారి విద్యాభినివేశ మాతని కుత్సాహము కలిగించినది కాదు. ఆచార్యపీఠము నధిష్ఠించి శాస్త్రధిషణచే భారతమున వైజ్ఞానికుల నెండఱినో యుత్పత్తిచేయఁ గల యుత్తమాచార్యుఁ డెవ్వఁడై యుండునా యని యాతనికై యన్వేషించెడి వాఁడు. గుణముండిన నాదరించు స్వభావము గల ముఖర్జీ పండితుని దృష్టి శాస్త్రతృష్ణతీరక వ్యసనపడు శ్రీరామనునందు వాలకపోలేదు. మిక్కిలి యుత్సాహాభిమానములతోఁ బ్రభుత్వోద్యోగమున నుండియు శాస్త్రమునందలి ప్రీతినివదలక ప్రయోగశాలలఁబడి యహర్నిశ మేదియో శాస్త్రజిజ్ఞాసచేఁ గడుపు రామను పరిశోధనలను, నాతఁడు ప్రచురించిన పరిశోధనల ఫలితములను ముఖర్జీ తిలకించుచునే యుండెను. రామను స్వతంత్ర పరిశోధన లాతనిని తన్మయుని చేసెననుటలో నాశ్చర్యములేదు. అప్పటికి రామనునకు నిరువదియైదు వత్సరములయినను సరిగా నిండలేదు. ఆష్టోష్ రామనుని పిలిపించి యాతని కా శాస్త్రాచార్యపీఠము నొసంగెను. రామను గూడ స్వీయము లయిన కొన్ని నిబంధనల కాతని నొప్పించి యాపదవి నంగీకరించెను. కాని తారకనాథ పాలిత్ దానవిరాశ శాసనము ననుసరించి యాపదవికిఁ బాశ్చాత్య దేశముల కరిగి శాస్త్రమునేర్చి వచ్చిన యతఁడే యర్హుఁడు. ఈ యాటంకము రామనుహృదయమునకు శల్యమువలె నాటి బాధింపసాగెను. హృదయావేగమును లఘూకరించుకొన రామను సర్ గూర్దాసు గృహమున

కతని దర్శింప నరిగెను. సూర్ దాసునకు రామనునందుని ర్వ్యాజ మగు ప్రేమ. రామనునిఁ జూచి సూర్ దాస్ హృదయపూర్వక మగు స్వాగతమిచ్చి యాదరించి, యంతకుఁబూర్వమే రామను నుద్యోగమును గూర్చియుఁ, దన్నిబంధనముల గూర్చియుఁ దెలిసినవాఁడగుట 'నీవెప్పుడు ఇంగ్లండున కరుగుచుంటి' వని ప్రశ్నించెను. రామను 'నేను వెళ్లుట లేదు. నాకు వెళ్ల వలయుననియును లేదు. కాని వారుమాత్రము నిర్బంధించుచున్నా' రని సమాధాన మిచ్చెను.

"అవును, ఆచార్యపీఠమునకు ఆంగ్లదేశ విద్యావ్యాసంగత్వము తప్పని నియమము. ఇప్పుడీ విషయములో నేమి చేయవలయునో తోచకున్నది." అని సూర్ దాస్ ఆలోచనా నిమగ్నుఁడయ్యెను. ఆచార్యపదవి నధిష్ఠింపవలయు నని యున్నది. కాని యంతరాయము తరింపరానిదై యున్నది. రామను తనహృదయబాధను సూర్ దాసునకు నివేదించెను. సర్ సూర్ దాసు ఆలోచించి, యా నిబంధనల యవివేకమును గుర్తించి, రామనునకుఁ జిత్త స్వాస్థ్యము కుదురునట్లుగా నావేశపరుఁడై "రామన్, నీవింగ్లండునకుఁ బోనవసరము లేదు. ఆ నియమము హిందూమనీష నవమానించునట్టిది. అయ్యది స్వతంత్రపరిశోధనకుఁ బాశ్చాత్యారాధనము తీరనియుపాధి యని చెప్పి భారతీయప్రతిభ నీసడించుటయే కాదు, అవమానించుచున్నది కూడ. దీని యంతరార్థము - శాశ్వతముగా భారతీయులు పాశ్చాత్యాదర్శముపై నాధారపడి యుండ వలయుననుట. ఇదియా వైజ్ఞానికాచార్య పదవీ సంస్థాపన ప్రయోజనము! హిందూ శాస్త్రస్వాతంత్ర్యమునకుఁ బోరాడు

ఆష్టోష్ ముఖర్జ్యాదర్శము పటాపంచలై పోయినదే! ఇత్యాది ఆత్మవిద్రోహకర మయినట్టిది. ఇంత లోకువగ నీవు మము నిర్ణేత యాలోచించి యుండ లేవు. ఆ దానశాసనము యొక్క ముఖ్యార్థము నాకు సుముఖముగనే యున్నది. దాని యభిధార్థ మంత పాటింపఁ దగినది కాదు. అందుచే ఆష్టోష్ కడ కరిగి నిస్సంశయముగా 'సంధానము నేఁ జేయఁ జాల'నని చెప్పు''మని హృదయశల్యము నూడఁ బెఱికెను.

రామను ఆష్టోష్ పండితుని దర్శించెను. గూర్ దాసుని వివరణమును వినిపించెను. ఆతఁ డాశ్చర్య చకితుఁ డయ్యెను. ముఖర్జీ యితరాధ్యక్షులవంటి వాఁడు కాఁడు. కలకత్తా విశ్వకళా పరిషత్తులో నాతఁ డాడినదే వేదము. దాని శాసన సమ్మతత్వమును విమర్శించినవారు లేకుండిరి. ఆతఁ డేది యొనర్చిన నయ్యది విశ్వకళా పరిషత్ క్షేమముకొఱకే యని యందఱు నెఱుంగుదురు. అట్లని యాతఁ డుదారభావుఁడు కాక పోలేదు. శాస్త్రాచార్యపదవికి రామను ఆవశ్యకమయినవ్యక్తి. ఆతనిని విడుచుటకు వీలులేదు. ఏదో విధముగ నియమము ననుసరించి యనుసంధింప నతఁడు సర్వశక్తులఁ బ్రయత్నించెను. ప్రాథమిక విరోధముల నెల్ల నడంచి ముఖర్జీ యమితానంద భరితుఁడై పరిషచ్ఛాస్త్ర కళాశాలకు శంకుస్థాపన చేయుచు ''సర్ తారకనాథుని యాచార్య పీఠమునకు శ్రీ చంద్రశేఖర వేంకట రామనును బడయుటకు మనము గర్వింప వలసి యున్నది. అననుకూలములగు పరిస్థితులలోఁ జిక్కుకొని పాశ్చాత్యుల పరిశోధన కేమాత్రము తక్కువ కాని శాస్త్ర పరిశోధనల నీతఁ డాచరించియుండుట ముదావ

కాము. ఈతని యనన్య సదృశములయిన పరిశోధన లన్నియు శాస్త్రి జ్ఞానక్షేత్ర ప్రథమ కృషీవలుఁడగు శ్రీ మహేంద్ర లాల్ సర్కారు మహాశయునిచే నెలకొల్పఁ బడిన యీ వైజ్ఞానిక కేంద్రమునందే ప్రయోగింపఁ బడుట మిక్కిలి యభినందింపఁ దగిన విషయము. శాస్త్రి కృషికొఱకు చక్కని యుద్యోగమును దృణీకరించిన రామను త్యాగము శ్లాఘ్యము, పూసీలము కూడ. ఈ త్యాగమూర్తి నాదర్శముగా నిలుపుకొని యీ శాస్త్రి విద్యా దేవాలయమునుండి తత్త్వ పరిశోధకులు పలువు రావిర్భవింతు రని యాసించు చున్నా" నని పలికెను.

రామను ఆచార్య పీఠము నలంకరించి దాని కెన్నియో తన్నులు చిన్నలు చేకూర్చెను. ఆతని ప్రయోగ నైపుణి, శాస్త్రి పరిశోధన వేనోళ్ళ పొగడఁబడెను.

అష్టోష్ ముఖర్జీ సాధారణముగా నెన్నడును బొరపడి తప్పుగాఁ గార్య నిర్ణయ మొనరించి యెఱుఁగఁడు. రామను కుదకుఁ దనకుఁ దగిన వృత్తి నిశ్చయించుకొనెను. అవసరము లభించినప్పుడెల్ల రామను గుణశీలముల గూర్చి అష్టోష్ అధికముగా శ్లాఘించి విడువనిది లేదు. అది యెంత మాత్రము శ్లాఘ యనిపించుకొనదు. ఆతని గుణప్రకటన మాత్రము. అష్టోష్ రామనుల యుద్యోగ ధర్మములలో నందందు వారిరువురకును భేదాభిప్రాయములు వచ్చిన సమయములు, రామను ఆచార్యత్వమును త్యజించి పోవ నుద్యమించిన తరుణములు లేకపోలేదు. ఇంతకును నిరువు

కును ననంత మేధావులు, పరమ స్వతంత్రులు. అయినను వారి యంతః కలహములు వ్రేళ్లు నాటుకొని స్థిర వాసములు చేసికొన్నవి కావు. వెంటనే వారిలో వారికి సామరస్యము కుదిరెడిది. శాస్త్ర ప్రచారణ కార్యము నిర్విఘ్నముగఁ గొన సాగెడిది.

## IV

### రామను పండితుఁడు-ఆతని విద్యార్థులు

శ్రీ రామను అధ్యయనాధ్యాపక శక్తుల ప్రశస్తులు దిగంతముల వ్యాపించెను. ఆతని శాస్త్రసంస్థ ప్రపంచ మండలి తద్విధ సంస్థలకు మకుటాయమానమే కాక యద్వితీయ మయినదయినది. శాస్త్రాచార్యులయిన కీర్తిశేషులు ప్రఫుల్ల చంద్ర రే, జగదీశ చంద్రబోస్ మున్నగు వారివలె శ్రీ రామను మహాశయునకును బేరెత్తి గర్వించుటకు వీల యిన పలువురు విద్యార్థులుకలరు. పుష్పపరిమళము బంభర బృందము నాకర్షించు పగిది రామను శాస్త్ర విజ్ఞాన కుసుమములు వికసించి పరిమళభరితము లగుకొలఁదిని పలువురు శాస్త్రవిద్యార్థి బంభరు లాకర్షింపఁబడి యుండే యుండి గురు పాదాంతికమున శాస్త్ర పరిశోధనలగావించి ప్రఖ్యాతిబడసిరి. వారిలో కళాప్రపూర్ణులయిన వారనేకులు. శ్రీ యస్. కె. బెనర్జీ, రామనాథము, ఫణీంద్రనాధ్ ఘోష్, యస్. కె. మిత్ర, యస్. భగవంతము ప్రభృతులు కొందఱు మాత్రమే. తమ యాచార్యుని దర్శకత్వము క్రింద వారు పరిశోధించి ప్రకటించిన శాస్త్ర సోపన్యాసములు పాశ్చాత్య శాస్త్ర

జ్ఞులకు దైనందిన వ్యవహారమునఁ గూడ స్మరింపఁదగిన వైశిష్ట్యము గనొందినవి. ప్రభుత్వము వారును రామను పండితుని ఘనత నుగ్గడించిరి. లబ్ధప్రతిష్ఠుఁడయిన కొలఁదిని నానా విశ్వకళాపరిషత్తుల నుండియు, దేశము నలుమూలలనుండియు విద్యార్థులు తండోపతండములుగా రామను శాస్త్రి కళాశాలకు పరిశోధనకు వచ్చెడివారు. రామను విద్యార్థులమని చెప్పుకొని గర్వించెడివార లెందఱో కలరు. మనదేశముననే కాక ఖండాంతర దేశములందును రామను విద్యార్థులమని చెప్పుకొనుట గొప్పదైనది. నిజమునకు నంబరచుంబి శిఖరములు గలిగిన సౌధము లనేకము లుండినంతమాత్రమున నది యొక విశ్వకళాపరిషత్తు కాఁజాలదు. ఎందఱు పండితుల బృందము నండఁడినొందిందొ శాస్త్రవ్యాసంగమునఁ గాలము పుచ్చెదరో యయ్యది భవన శోభావిహీన తలమయ్యును, యథార్థముగు కళా కేంద్రము. రామను మెట్టిన చోటెల్ల నొక కళాపరిషత్తయిన దనుటలో నతిశయోక్తి లేదు. ఎన్నడు రామను దర్శకత్వమున, నియంతృత్వమున హైందవ శాస్త్రకళా సంస్థలందను నగరమండలి ప్రఖ్యాత డేవీఫేరడే ప్రయోగశాలతో నుపమింప నర్హమయినదగునో ! ఇయ్యదసంభవమా!

రామను శాస్త్రికృషీవలత్వము :

శాస్త్రజ్ఞునకు నూతన పరిశోధనములందును, నూతన వస్తునిర్మాణమునందును నాసక్తి సహజము. అది లేనినాఁడు శాస్త్రజ్ఞుఁడు రాణింపలేఁడు. శాస్త్రజిజ్ఞాస వాని యుపాధి. కార్యదీక్ష, ఆత్మవిశ్వాసము లాతని యాలంబనములు.

జన్మతఃప్రభృతి శాస్త్రజ్ఞుఁడైన రామనునకు వస్తుపరిశీలనా సక్తి వెన్నతోఁబెట్టినది. ప్రకృతి మిక్కిలి యుదారమయినది. గభీరమయినది. సమగ్రముగ దుర్గ్రాహ్యమైనది. కవికంటె శాస్త్రజ్ఞుఁడు ప్రకృత్యారాధకుఁడు కావలయును. ఏలయన ప్రకృతియే యాతని ప్రయోగశాలయగుట. ప్రకృత్యవగాహ నము, ప్రకృతితోడి యత్యంత సాహచర్యము గలిగిననాఁడే ప్రకృతి రహస్యము లితఃపూర్వములు దుర్గ్రాహ్యములైనవి సుగమములగును. ప్రకృత్యారాధనముతోఁ దన్మయుఁడై తద్రహస్యముల నెఱింగిన శాస్త్రకోవిదులలో రామను ప్రథముఁడు కాకున్న మానె ప్రధానుఁడనుటలో సంశయము లేదు.

చిత్ర విచిత్రమయిన ప్రకృతి రామనుని పరవశుని చేసెడిది. బ్రిటిషు దీవులకు నావలో నరుగుచు రామను తన చిన్నగదిలోఁ బుస్తక పఠనముతోఁ గాలముపుచ్చక శ్యామలా కాశమును, శ్యామల వర్ణమున శోభిల్లునించు గభీరోదధినిఁ దిలకించుచు నౌకోపరిభాగముననే తదేకదృష్టితోఁ బరిశీ లించుచు నుండెడివాఁడు. ఆకాశము యొక్క నీలవర్ణమున కును, సముద్రోదకముల నీలిమకును కారణ మేమయి యుం డునా యని యతఁ డాలోచింప సాగెను. ఆ ప్రకృతిపరిశీలన ఫలితములే యాతని ప్రయోగశాలలో నూతన సిద్ధాంతము లను నావిష్కరింపఁ జేసినవి.పరిశోధన, యందును శాస్త్రపరి శోధన యత్యవసర మయినదని రామను దృఢవిశ్వాసము. 1926 సంవత్సరమున కాశీ విశ్వ విద్యాలయమున స్నాతకో పన్యాస మొసంగుచు రామను "మనము ప్రస్తుత ముండునది

యుపనిషత్కాలము కాదు. వేదకాలము కాదు. మఱి మనము నూతన ప్రపంచమున వసించుచున్నాము. అందును నీయుగము పరిశోధన యుగము. నూతన విజ్ఞానమును ద్రవ్వి తలకెత్తుటకు, నిర్మాణించుటకు ప్రయత్నించు దినము లివ్వి. ఇతఃపూర్వము వందసంవత్సరముల వెనుక నెఱుఁగఁబడని పెక్కు శాఖలలోఁ బరిశోధన లిప్పుడు జరిగినవి. నూతన విషయములు పరిశోధింపఁ బడినవి. ఇంకను బరిశోధింప వలసినవి పెక్కు కలవు. ఇంతటి మానవోత్సాహముతో విజ్ఞాన పరిశోధనము జరుగుచుండ మనకేల యని మనము మడి కట్టుకొని యంటక యుండరాదు. అట్లుండుట మనము నిరర్థకుల మనియు, కార్యశూరతా శూన్యుల మనియు, నితరులచే నధఃపతితులముగాఁ జేయఁబడుటకుఁ దగినవార మనియు నంగీకరించుట! దీనివలన నార్థిక స్వాతంత్ర్యము, లేదా యభ్యుదయము గాని రాజకీయోన్నతి కాని మనకు రానేరాదు.” అని యావేశ పూరితుఁడై యుపన్యసించి భారతీయులు తమ భవిష్యజ్జీవితవీథులలో నెట్లు సంచరించుకొనవలయునో సూచించినాఁడు. మన దాస్యము మొన్న మొన్నటి దాక నిట్టి నిర్లక్ష్యముతోడి జీవిత సూత్రముల నవ్విధ్యయాచరించుట వలననే గలిగినది. ఏజాతియైన వైజ్ఞానికముగా నభివృద్ధి పొందవలయునన్న స్తబ్ధముగా నుండరాదు. చాకచక్యముతోఁ బ్రపంచమందలి సర్వప్రధాన విషయములతోడి పరిచయమును గలిగి యుండవలయును. “పరిశోధన మన్న విజ్ఞానము కొఱకు నన్వేషించుట. దాని నార్జించుట. అందుచే సరియైన విద్యాపద్ధతిలోఁ బరిశోధన యత్యున్నత స్థానము నాక్ర

మించు చున్నది. ఇప్పటి విజ్ఞానము పుస్తకములో లిఖితమై మృతమైనదని భావింపరాదు. విజ్ఞాన మనుదినమును నభివృద్ధి చెంది నవ్యాతినవ్యమగుచున్నది. ఇట్టి నిరంతరాభివృద్ధినొందుచు సర్వముఖముల విజృంభించు విజ్ఞానము పుస్తక పఠనమాత్రము చేతనే లభించునని విశ్వసింప వీలగునా? "యని పరిశోధనయొక్క ప్రాధాన్యమును గూర్చి రామను వచించెను. ఈతని వాక్యములు వేద గదితములవలె సత్యములు.

రామను పాశ్చాత్య దేశసంచారము :

అప్పుడు సర్ తారక నాథపాలిత్ ఆచార్య పీఠమున కావశ్యక మయిన పాశ్చాత్య దేశ విద్యాయాత్ర రామనున కిప్పుడు తటస్థ పడెను. రామను ప్రతిభను గుర్తించి 'రాయల్ సొసైటీ ఆఫ్ లండను' వా రాతనికి ఛాత్రత్వమును బహూకరించిరి. ఈ సంఘమునందలి సభ్యత్వము లభించుట దుర్ఘటము. పాశ్చాత్య దేశమునందలి వివిధములైన వైజ్ఞానికసమాజములు, పరిశోధక మండలములు పదేపదే రామను నాహ్వానించుచు వచ్చినవి. అట్టి సంఘములలో కెనడా యందలి అభ్యుదయ వైజ్ఞానిక సమాజము, లండను నందలి కెల్విన్ శాస్త్రిసంస్థయు ముఖ్యమైనవి. కెల్విన్ సంస్థవారు శతవర్షోత్సవమును జరుపు చుండిరి. హిందూశాస్త్ర ధిషణకుఁ బ్రతినిధిగ రామను తదుత్సవమునఁ బాల్గొనవరిగెను. ప్రతిభా సముద్రుఁడయిన రామనున కెచ్చట కాలిడినను నచ్చట నపూర్వమగు హృదయపూర్వక స్వాగతము లర్పింపఁ బడెను.

హిందూ దేశమును వీడి లండను నందలి 'రాయల్ సొసైటీ'లో నేతత్సంఘ సభ్యుఁడుగఁ బాల్గొన వరిగెను. లండనునం దా సంఘ కార్యక్రమమున ప్రముఖపాత్ర వహించుచు 'డేవీఫారడే' ప్రయోగశాలలోఁ దన ప్రయోగములను సాధించు చుండెను. తరువాత కెల్విన్ శతవర్షోత్సవమునఁ బాల్గొని కెనడా యందలి వైజ్ఞానికాభ్యుదయ సంఘమున కరిగెను. మొట్టమొకట రామను నేదో యొక శాస్త్రి విషయమును గూర్చి వ్యాసమును జదువు మని కోరిరి. కాని యాతఁడు 'టొరెంటో' పోవుసరికి. రామనునే 'కాంతి ప్రసరణము'ను గూర్చిన సిద్ధాంతములను గూర్చి వాదములను ప్రారంభింపుఁడని కోరిరి. ఇది యాతని యభిమాన విషయము. శ్రోత లాశ్చర్య చకితులగున ట్లుపన్యసించి రామను వారి మన్ననకుఁ బాత్రుఁడయ్యెను. తన యుపన్యాసమును ముగించి రంగతలము నవతరించు సమయమునఁ బదార్థ విజ్ఞాన శాస్త్రమున నోబిల్ లార్ప్యాటు పదవినొందిన గొప్ప శాస్త్రిజ్ఞుఁడైన ప్రొఫెసరు మిలికాను రామనుతో హస్తసంచాలనము చేసి పరిచయము చేసికొనెను. రామను పాశ్చాత్య దేశములలో సుమారు పదిమాసముల కాల ముండెను. ఈపదిమాసములలో నెన్నియో శాస్త్రి పరిశోధనశాలల నాతఁడు దర్శించెను. ప్రముఖులయిన పలువురు శాస్త్రిజ్ఞులతోడి పరిచయమును సంపాదించెను. పెక్కు విశ్వకళాశాలలలో విద్వాంసుల యెదుట పలు విషయముల గూర్చి యుపన్యసించెను. అంత శ్జాతీయ గణిత శాస్త్రిజ్ఞుల సభ కీతఁ డధ్యక్ష పదవి నొంది శ్రాతిక విజ్ఞానశాస్త్రమునకు సంబంధించిన గణితమునుగూర్చి

ము పన్యసించెను. ప్రపంచమునందలి వివిధదేశ గణితశాస్త్రజ్ఞులతోఁ బరిచయ మీతని కప్పుడు లభించెను. రష్యాదేశపు శాస్త్రజ్ఞులు, తమ దేశమునకు వచ్చి తమ సంఘమున నొక యుపన్యాస మొసఁగవలయునని రామనునిఁ జాల బలవంత పరచిరి.

సభలు, ఉపన్యాసములు నయిన వెనుక ప్రత్యేక మైన రైలులో రామను కెనడాలో స్వేచ్ఛావిహారమున కాహ్వానింపఁబడి యరిగెను. కెనడాయందలి ప్రకృతి దృశ్యములను, సరస్సులను, మంచుదిబ్బలను, జాతీయోద్యానములను, చక్కని ప్రకృతిశోభాభాసమానములగు పర్వతములను దిలకించి యతఁడు తన్మయుఁడయ్యెను. తోడి శాస్త్రజ్ఞులతో శాస్త్ర విషయ ప్రసంగములచే నాతఁ డెంతయో మురిసెను. తన వినోదయాత్రలో Glaciers (మంచుదిబ్బల) రంగును గూర్చియు, వాని నీలిమ కారణమును గూర్చియు నాతఁ డొనర్చిన సూచనలు, ప్రత్యేకముగా నావిషయమును గూర్చియే పరిశోధన గావించిన మార్గిల్ పండితుఁడు సమంజసములై నవని యభిప్రాయ మొసంగెను. ఆయా ప్రదేశముల సంచరించుచు రామను తద్విధమయిన వర్ణీకరణమును గూర్చి పలువిధములుగ నూహించి క్రొత్త సిద్ధాంతముల నూల్కొల్పెను.

అమెరికాలో రామనునకుఁ గాల మెట్లు నడచిపోయెనో తెలియదు. నూతనులతోడి పరిచయములు, నూతన విషయ పరిశోధనలు, ఉపన్యాసములు— వీని తోడనే కాలము క్షణముగ దొఁగెను. ఆతనికింక రెండువారము లేగడువుమిగులగా నమె

రికానుండి ఇంగ్లండునకుఁ దిరిగివచ్చెను. అచ్చటనుండి ఆస్లోవా, స్టాక్‌హోమ్, బెర్లిన్, పారిస్ మున్నగు ప్రదేశములకు విమానముపై నరిగి తనకు సంబంధించిన విషయములలోఁ బరిశోధనల జరుపు ప్రముఖులతోఁ బ్రసంగించెను. ఆసమయముననే ప్రొఫెసరు నీల్‌భోర్‌న కితఁడతిథిగా నరిగి యాతని యాతిథ్యమును గ్రహించు భాగ్యము కలిగెను. ప్రొఫెసరు నీల్ భోర్ శాస్త్రవిజ్ఞాన ప్రపంచమునఁ దేజోవంతమగు దివ్యతారక. భోర్ ప్రయోగశాలలోఁ దన ప్రయోగముల నాతఁడు చేసిచూపించెను. అచ్చటనే యాతని ప్రాఁత విద్యార్థియైన డాక్టరు బింమభూషణరేను ఆతఁడు కలిసికొనెను. రామను కలిసికొనిన ప్రఖ్యాత శాస్త్రజ్ఞులలో ప్రొఫెసరు స్టోమరు, ప్రొఫెసరు ఆర్హినను, ప్రొఫెసరు బిల్లోవిన్ మున్నగువారు కలరు. వారందఱును శాస్త్రపరిశోధనముల నందెవేసిన చేతులు. దిగంతవ్యాప్త కీర్తులు. వారితోడి పరిచయము రామునకు నూతనోత్సాహమునొసంగెను. శాస్త్రాకాశమున నఖండజ్యోతులయిన పలువురు విద్వాంసులతోఁ బరిచయము నొంది, 1925 మార్చి 18వ తారీఖున పదిమాసములు పాశ్చాత్య దేశయాత్ర చేసి యినుమడించిన శాస్త్రజ్ఞానముతో హిందూదేశమునకు రామను మరలి వచ్చెను. కాని మరల కొన్నిమాసములకే రష్యాదేశపు శాస్త్రసంఘ శతద్వయవర్షోత్సవమునఁ బాల్గొన నాహ్వానింపఁబడి రామను రష్యాదేశమున కరిగెను. రాజు తనదేశముననే గౌరవము నొందు, పండితుఁడో యెల్లయెడల గౌరవము నొందు నన్న యుక్తి యథార్థమై రామునందుఁ బ్రత్యక్షమయ్యెను.

## V

## శాస్త్రి వ్యవసాయము

రామను శాస్త్రి కేదారముల దున్ని శాస్త్రిబీజముల నెన్నింటినో నాటి దోహదమొనర్చి శాస్త్రి సస్యములను బండించి బండ్లకెత్తెను. ఆ శాస్త్రిసస్యము లనర్ఘములయి నవి. సామాన్యుల గ్రహణకు దూరములయినవి. శాస్త్రిజ్ఞ లకే దురవగాహములగునట్టియవి శాస్త్రివాసన లేని వారల కెట్లు తెలియఁగలవు? రామను 'సబ్బుబుడగల' గూర్చి పరి శోధించెను. 'రామనుఎఫక్టు' అనునది కాంతి కిరణప్రసారము లకు సంబంధించిన విషయము. అయ్యది ప్రపంచమునందలి శాస్త్రిజ్ఞులనందఱినుబ్బూతలూగించినది. వేఱొకటి క్రాంటన్ ఎఫక్టు. ఇయ్యది 'X' Rays కు సంబంధించినవిషయము. ప్రకాశకిరణములకు సంబంధించినవియే కాక భౌతిక శాస్త్రి మందలి యితర శాఖలయందును రామను కృషిసల్పి నూతన సిద్ధాంతముల నావిష్కరించెను. విద్యుచ్ఛక్తికి సంబంధించి 'లోహములయందలి విద్యుద్ద్రావక'మను నొక విషయము గూర్చి యాతఁడు పరిశోధించెను.

1929వ సంవత్సరములో మదరాసులో జరిగినశాస్త్రిజ్ఞ సమ్మేళనమునందు 'కాంతి ప్రసరణము' అను శాస్త్రీయ విషయమును గూర్చి యధ్యక్షోపన్యాసమును రామ నొసం గెను. 'వాయువుల యయస్కాంతపు గుణములు' అను విష యము నొండు నాతఁడు పరిశోధించెను. మదరాసులో హిందూ వైజ్ఞానిక సమాజము పక్షమున'X'Rays విషయమునందాను

క్రొంగ్రొత్తగా నొనర్చిన సిద్ధాంతములను గూర్చి యుపన్యసించెను. రాముడు తన సిద్ధాంతముల నన్నింటిని భూత దర్పణమున యవనికపైఁ బ్రతిఫలింపఁజేసి ప్రదర్శించి సోదాహరణముగ వివరణాత్మకోపన్యాసముల నొసంగెను.

తరువాత రాముడు ఆంధ్రవిశ్వకళాపరిషత్సభలో స్నాతకోపన్యాసమునీయ నాహ్వానింపఁబడి యుత్కృష్టమైనయుపన్యాసమునొసంగెను. పరిషత్కళాశాలా ప్రయోజనము, జ్ఞాన ప్రచారము, ఆదర్శ ప్రవర్తనము, సంస్థాస్థాపనల గూర్చి తన యుపన్యాసమున నాతఁడు ముచ్చటించెను.

పారితోషికములు – గౌరవములు :

రాముని యొక్క శాస్త్ర మనీష, దిగంత విశ్రాంత కీర్తి, వాక్చమత్కృతి, శాస్త్రపరిశోధన ప్రభుత్వమువారు గణుతింపక పోలేదు. కాలవిలంబనమైనను గుణము గణింపఁబడక మానదు. మొదట ప్రపంచము గ్రుడ్డిగాఁ బ్రవర్తించినను, కాలక్రమమున నచంచల గుణమునకే లోకము గౌరవమొసంగును. 1929వ సంవత్సరము జూను మూడవ తారీఖున రాజుగారి జన్మదినోత్సవపు సందర్భపు గౌరవ బిరుద ప్రదానములలో శ్రీ రామునునకు (Knight-hoood) సర్ పదవి యొసంగఁబడినది. పాశ్చాత్య దేశీయు లంద జామోదించిన శాస్త్రజ్ఞాన కీబిరుదము వారి పొగడ్తలకంటెను, మన్ననలకంటెను ఘనతరమైనది గాదు. కాని, ప్రభుత్వమువారు గూడ నాతని ప్రతిభ గణించి గౌరవించిరనుట మోదావహము. సర్ బిరుదమునకు దాక్షిణాత్య సంఘముచే గౌరవింపఁబడి

రామను "మీరందఱును నా శాస్త్రపరిశోధనల నెన్నింటినో మీసన్మాన పత్రమున నుగ్గడించిరి. శాస్త్రజ్ఞ సమ్మేళన మున నేజెప్పినట్లు, నే నిప్పుడే శాస్త్రజ్ఞ శీలమును బ్రారంభించి తిని. ఇది నాయభిప్రాయము. శాస్త్రజ్ఞుఁడు గౌరవముల కొఱకు, బిరుదముల కొఱకుఁ బాటుపడరాదు. పాటుపడినచో నాతని శాస్త్రజ్ఞ జీవిత మంత మొందినట్లే. శాస్త్రజ్ఞుఁడు బహూకృతులనుగాక తన పరిశోధనలయందు సంతోషమూ నొందవలయును. గౌరవాదులు జీవితములో నెప్పుడో కలుగు నట్టివి. అవి యంత ప్రధానములైనవి కావు. నేను నాపరి శోధనయందే యఖండానందము నొందుదు"నని వచించెను. ఇట్టిశాస్త్రైకదృష్టి, శాస్త్రజనిత పరమానందము కృతపుణ్యు లకుగాని లభింపదు. రామను పూర్వజన్మమున యోగియై తన చరితార్థమును గనుగొనఁ జాలక యీ జన్మమునఁ బ్రయో గరూపమున తనయోగ శేషమును సాధింప నవతరించిన వ్యక్తియనఁ జెల్లదా!

పరంపరలుగా బిరుదములు, పొగడ్తలు వర్షించు చున్నను రామను స్వీయజ్ఞానముతోఁ దృప్తిచెంది శాస్త్ర వ్యాసంగమును మానినవాఁడు కాలేదు. బెంగుళూరు నందలి శాస్త్ర ప్రయోగశాల కధ్యక్షుఁడై యెందఱో విద్యార్థులకు శాస్త్ర పాఠములను గఱపి, నిజమైన శాస్త్రాభిలాష, పరిశో ధనాసక్తి వారియందు గల్గించెను. అతఁడు వజ్రములను గూర్చి యెన్నియోవిషయములు పరిశోధించెను. ఈతని యఖండ శాస్త్రప్రతిభ 'నోబెల్' బహుమానము నాకర్షించినది.

దానితోఁ బ్రపంచమున నలుమూలలయందును నాతని కీర్తి చంద్రికలు వ్యాపించెను.

సాధారణముగా శాస్త్రజ్ఞులకు సారస్వతవ్యక్తీకరణ ముల వడదు. అలవడిన నాఁడే కాని, పరిశోధిత శాస్త్రవిషయ ప్రకటనము జనాకర్షకముగ నుండదు. కాని యీ సిద్ధాంతమునకు రామను అపవాదము. ఈతఁ డెంత శాస్త్రజ్ఞుఁడో యంతటి వక్తకూడ నై యున్నాఁడు. ఈతని యుపన్యాసములు సారస్వతోపన్యాసము లన్నను బాధాకరము కాదు. అతఁడు గంటలాది శ్రోతృజనములను నవ్వించుచు, క్లిష్టశాస్త్ర విషయములను గూర్చి యుపన్యసింపఁగల ప్రజ్ఞకలవాఁడు.

రామను వర్ధమాన శాస్త్రజ్ఞులలో నొకఁడు. ఈ పిండికను నెన్ని శాస్త్ర విషయములను బరిశోధించి శాస్త్రజ్ఞానమును వెదజల్ల వలయునో! భగవంతుఁ డాతని కాయురారోగ్యైశ్వర్యము లొసంగి శాస్త్ర కృషికి దోహద మొసంగుగాత.